# శ్రీభక్తచింతామణి.

ఇది

రాజమహేంద్రవరమునందలి దొరతనమువారి

మొదటితరగతి కళాశాలయందు

నాంధ్రోపాధ్యాయులగు

వడ్డాది సుబ్బారాయునిచే

రచియింపఁబడినది.

---

౯ వ కూర్పు.

రాజమహేంద్రవరము.

శ్రీవిద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

---

౧౯౨౦

 [దీని వెల ౦-౫-౦

## —* వేణీసంహారనాటకము. *—

ఇది వడ్డాది సుబ్బారాయకవిగారిచేత వ్రాయఁబడినది అనేక నాటక సమాజములచే అనేకపర్యాయములు అనేకస్థలములయందు ప్రదర్శింపఁబడినది దీనిని గుఱించి విశేషముగ వ్రాయవలసినపని యేమున్నది? క్రొత్తకూర్పు ముద్దులు మూటగట్టుచున్నది. వెల రు 1—0—0

ది 1969

## —* రాణీసంయుక్త. *—

ఈగ్రంథము శ్రీవేలాల సుబ్బారావుగారిచే వ్రాయఁబడిన ఒరిజనల్ నవల. ఇందలి కథాభాగ మేది యన, హిందువుల రాజ్యసమాప్తితో మహమ్మదీయులు రాజ్యస్థాపనము చేయుట. కథాచమత్కృతి వర్ణింప నలవికాదు. ఈనవల నాల్గునాటకముల రచనములకు మార్గదర్శియై ఆంధ్రప్రపంచమున నవలాప్రీతి మిక్కుటముగఁ జేసినది. వెల రు 0—12—0

## —* మహాపురుషులజీవచరిత్ర. (3 భాగములు) *—

ఇది విఖ్యాతకవులగు చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారిచే వ్రాయఁబడినవి. దీనిని జదువుటవలన గొప్పగొప్పభావములు గలిగి గొప్పవారగుట నిస్సందేహము. దీనిని జదివి అనేకులు బాగుపడినారు.

మొదటిభాగము 0-12-0 రెండవభాగము 0-10-0 మూడవభాగము 0-12-0

## —* వరాహపురాణము. *—

ఇది నంది మల్లన్న, ఘంట సింగయ్య యను నిరువురు కవులచే రచియింపఁబడినది. ఈగ్రంథము చదువునపుడు ఆనందాతిరేకముచేఁ బారవశ్యము కలుగును. సులభశైలి. ద్రాక్షపాకము నవరసబంధురము. వెల రు 1—0—0

వెలసులభము. మిథునానురాగము. ఫలమధికము.

వెల 0—8—0 లు మాత్రమే

మీకు పోష్టుద్వారా పంపఁగోరెదరేని 3 అణా (పోష్టేజీ) ఎక్కువగును. ఇప్పుడు 0-8-0 లకేవచ్చు. మూడణాలు లాభము. సాహసింపుడు

వలయువారు:—ఆర్యపుస్తకాలయము,

రాజమహేంద్రవరము.

# మొదటికూర్పు పీఠిక.

---

భక్తచింతామణి యనుచిన్నపొత్తమును నే నింతకుఁ బూర్వ మంచు డాఱు సంవత్సరములకిందటఁ జేయ నారఁకొని కొన్నిమాసములలో నించుమించుగ నూఱు పద్యములు విరచించి యందు నెనుబదివఱకు నప్పుడప్పుడు హిందూజనసంస్కారిణి యనునొకానొక వార్తాపత్రికయందుఁ బ్రకటితములు గావించితిని. అప్పత్రికయం దాపద్యములు చదివినవారలనేకులు వేర్వేఱు తావులనుండి నాకు వ్రాయుచు వచ్చిన యుత్తరములను బట్టి కొండొక ప్రోత్సాహంబు గలిగి, మొట్టమొదట నూటితోనే గ్రంథసమాప్తిఁ జేసి కొంత కాల మూరకున్నవాఁడనయ్యు, నిటీవల మరలఁ బ్రారంభించి యుత్తరశతమని మఱికొన్ని విశేషాంశములతో వేఱొక నూఱుపద్యములు గూర్చి రెండేండ్ల క్రిందట నీపుస్తకమును ముగించితిని. అప్పటినుండియు నేతత్పుస్తకమును సాంగముగాఁ జదువఁగోరి లేఖాముఖమ్మునను సమ్ముఖమ్మునను గూడఁ దఱచుగఁ బ్రశంసించు సుహృద్వరులకుఁ బరమాహ్లాదముగా దీనిని సాధ్యమయినంత శీఘ్రకాలములో నచ్చొత్తింపవలెనని నేను శక్తివంచనలేక ప్రయత్నించితిఁ గాని, యొంటిగా దీనిని బయికి రానించుట కీశ్వరుఁ డెందుచేతనో యిచ్చగింపక యీనవరసము దీనికిఁ దల్లివంటిదని చెప్పనొప్పెడు ప్రబోధచంద్రోదయ మను శాంతరసప్రాయ నాటక మొకటి నాచేత నాంధ్రీకరింపించి యీరెంటిని జంటగా దేశాటనము చేయింపం దలంపుగొనియె. అట్లు కానిపక్షమునఁ, దోడనే ముద్రితము గాఁగల దనుదృఢనిశ్చయముతో నిర్వ్యాప్రయత్నముఁ జేసి 1891 టవ సంవత్సరము నవంబరు నెలలోఁ జెన్నపురియందలి కొండొక సుప్రసిద్ధముద్రాశాలకు మహాత్మ్యాయ్యమునఁబంపఁబడి యీచిన్నపొత్తము, సాధారణముగా నింతలో ముద్రిత మగు నని కలనయిన నేనెప్పుడుఁ దలంచుకొని దగు ప్రబోధచంద్రోదయమునకుఁ గూడ నప్రయత్నముగా నచ్చుపడఁ దగిన కారణము సంఘటిల్లుదాఁక వ్రాఁత ప్రతియందే యక్కడ నడఁగి యుండి, కట్టకడ కానాటకముతో సమకాలమున ముద్రాయంత్ర మూనో

హించి కృతకృత్యమయి బయలు వెడలుట యెట్లు తటస్థించును? సరిచూడఁ బడుటకయి యేలూరులోని శ్రీమత్త్రిపురసుందరీ ముద్రాశాలనుండి ప్రబోధచంద్రోదయ నాటకముయొక్కయుఁ జెన్నపురియందలి హిందూచక్రవర్తినీ ముద్రాశాల (Empiess of India Press) నుండి యీభక్తచింతామణి యొక్కయు నాద్యంతపత్రములు సమకాలమునందే నాయొద్దకుఁ బ్రేషితములయి రాఁదటస్థపడినప్పు డేతద్దైవ ఘటనమునకు నేను మిగుల నాశ్చర్యపడి తన్నుఁగూర్చి ప్రశంసించెడు నీకృతిద్వయమును సర్వేశ్వరుఁ డాశీర్వదించునని భావించుకొన్నాఁడను.

అస్మద్విరచితము లగు గ్రంథములయం దెల్లనాయిల్లమునకుఁ జల్లఁదనమును సంఘటించినవి యీరెండు పాత్రములే. అయినను భక్తచింతామణి మాత్రము నాహృదయమున కిప్పుడింపుక పరితాపము కలిగించుచున్నది. నావలెనే దీనివలన నభీష్టసిద్ధి వడసి యానందించి దీని నతిశీఘ్రముగ నచ్చుఁ జూడవలెనని ముచ్చటపడిన నాయర్ధాంగలక్ష్మి విజయలక్ష్మి యింతకాలక జీవించియుండుట సంభవింపదయ్యెను. కాని, ఏతన్మూలమున నీశ్వరానుగ్రహమును సంపాదించుకొన్న యాక్రొత్తడియాత్మకు శాశ్వతానందము కలుగకపోదు.

ఈశ్వరుఁడు తన్నారాధించువారికి నాముష్మిక సౌఖ్యమునుమాత్రమే యనుగ్రహించునుగాని, యైహికాభిలాషలఁ దీర్చువిషయమునఁ దా నెంతమాత్రము దోడుచూపఁడని కొందఱు చెప్పుచున్నారు. నాయనుభవమునకది యెంతమాత్రము సత్యముగాఁ దోఁపలేదు. సర్వశక్తుఁడు, సర్వకారుణ్యుఁడు సర్వరక్షకుఁడు నగు సర్వేశ్వరుఁడు తన్ను నమ్మికొల్చువారికి న్యాయమయినంతవఱకు వారడిగిన దేదిగాని ప్రసాదింపక పోఁడని నా దృఢనిశ్చయము. ఇట్టియనుభవమును నాకుఁ గలిగించి దానిని స్థిరపఱచిన ప్రార్థనలీ భక్తచింతామణిలో ననేకము లున్నవి. ఆయాప్రార్థనలకుఁ దటస్థపడి నట్టి యవసరములును, గలిగిన ఫలములును, నామనస్సున నిప్పుడు తెన్నగ స్మరించుచున్నాను గాని, యవి యన్నియు వివరింపఁ బూనుట యనావశ్యకము.

భగవత్పరముగా నేను రచించిన చిన్న చిన్న స్తోత్రములు మఱి రెండు గలవు. అందొకటి పదునయిదు సంవత్సరములక్రిందట ముద్రణ మొందిన నందనందనశతకము. రెండవది భగవత్కీర్తనలు. ఈరెంటిలో భగవత్కీర్తనలయందే యిప్పటి జనసమాజమున కవ్యాజప్రీతి గలిగియున్నట్లు తద్వ్యాపనమువలనఁ దెలియవచ్చినందున, భాగవతమునందలి గజేంద్రస్తవమును బోలె ఆస్తికులయిన సమస్తజనులకుఁ గూడఁ బఠనీయమగునట్లు దీని రచియించినాఁడను. ఈపుస్తకమును గుఱించి నేనే తెలుపవలసిన యంశములు మాత్రము కొన్ని యిచ్చట ముచ్చటించితిని. ఇంక దీని గుణాగుణములకుఁ జదువరులే ప్రమాణము. ఏతద్గ్రంథముద్రాప్రభృతిప్రభృతులయందు నాకు మిగులఁ దోడ్పడిన రివరెండు ఎఫ్. జే. మెక్రిడి దొరగారికి సదా కృతజ్ఞుండనగుచున్నాను.

వడ్డాది సుబ్బారాయఁడు.

రాజమహేంద్రవరము,

విజయ సం॥ చైత్ర బ॥ ౧౩ శుక్రవారము,

శాలి॥ ౧౮౧౫ సం॥

14-4-1893.

---

# రెండవకూర్పు! విక్రమోర్వశీయము. చక్కనిఅచ్చు!



ఇది కాళిదాసమహాకవి విరచితమునకుఁ దెలుఁగు. అప్సరసయగు యూర్వశిని రాక్షసుఁడొకరుఁ డపహరించి యంతరిక్షమార్గమునఁ గొనిపోవుచుండఁగా నామెతోడిచెలికత్తెలమొఱ్ఱవిని యాకాశగమనమునఁ బ్రావీణ్యము గల పురూరవచక్రవర్తి యారక్కసు నుక్కడించి యామెను విడిపించిన కారణమునఁ బరస్పరానురాగ మంకురించి వారిరువురును వివాహముచేసికొనిరి. ఈవిషయమే బహువిధచమత్కారములు గలుగునట్లుగా రసపోషణముచేసి యైదంకముల నాటకముగాఁ గవి రచియించినాఁడు. శృంగారరసప్రధానమైనట్టి యీనాటకమునందలి భావములు మిక్కిలి పేశలములు. రసగ్రహణశీలాలసుల కిది యవశ్యము పఠనీయము. ఏతన్నాటకమునందలి పద్యములు మచ్చునకిట నొకటి రెండు చూపఁబడుచున్నవి.

దీనివెల రు. 0—8—0 అణాలు మాత్రమే!

తే. గీ. స్యందనక్షోభమునఁ జేసి యిందువదన
యంస మంసముతోడ రాపాడఁగానఁ
దలఁప నీభుజ మొక్కటే ధన్య మితర
మైనమే నెల్ల భూమికి నతిభరంబు. తృతీయాంకము.

చ. తొలుకరినీలమేఘ మిది, దుష్టనిశాటుఁడు గాఁడు; దాన ను
జ్జ్వల మగునింద్రచాపమిది, సజ్యము దానవువిల్లు గాదు; కే
వలము నవ వర్షధార లివి, బాణపరంపర గాదు; పైఁడిగీ
టులఁ దలపించుమించిది, హృదీశ్వరి యూర్వశిగాదు రూఢిగా, చ. అం.

చ. కొడుకుమొగంబుఁజూచి మదిఁ గుందకయానటుఁ జెందియుండఁగాఁ
బడఁతుక! నీవియోగ మనివార్యత నిప్పుడ సంభవించెగా!
మిడిమిడి గ్రీష్మతాపము శమింప నవాంబుదవృష్టిఁ గాంచి యొ
ప్పెడుతఱిఁ జెట్టుపైఁ బిడుగు భీకరభంగిని బడ్డకైవడిన్. పం. అం.

శ్రీరస్తు.

# భక్తచింతామణి

## కృత్యాది

శ్రీమద్భానుసహస్రమండలవిభాసీ! సచ్చిదానందమూ
ర్తీ! మాయాపరికల్పితాఖిలజగచ్ఛ్రేణీ! దయాంభోనిధీ!
స్వామీ! నీమహిమంబు లానిగమముల్ వర్ణింప లేకున్నచో,
నే మూఢాత్ముఁడ నే మెఱుంగుదును? దండ్రీ! భక్తచింతామణీ. ౧

మ. వసుధం బేద యొకండు పెన్నిధి లభింపం బొంగి, యవ్వార్త స
ర్వసుహృత్కర్ణరసాయనంబు నొనరింపన్ సంభ్రమోత్సాహమా
నసుఁడౌ కైవడిఁ, గేవలాజ్ఞమతికిన్ నా కబ్బు నీసేవ, హృ
ద్యసుపద్యంబులఁ జాటుకొందుఁ; బరమాత్మా! భక్తచింతామణీ. ౨

శా. ఆరంభంబుల కెల్ల జీవము మహాత్మా! నీవ కావే? భవ
త్కారుణ్యామృతవృష్టి నొందుఫలముల్ గార్యంబు; లే నీపయిన్
భారం బంతియు వైచి పౌరుషము యావచ్ఛక్తిఁ గావింతుఁ; బ్రా
పై రక్షింపవె సత్ప్రయత్నములు; దేవా! భక్తచింతామణీ. 3

మ. భయమో, మూర్ఖ్యమొ, విస్మయంబొ, మఱపో, వాకట్టొ, యేహేతువో
పయికిన్ రా వెదలోనఁ బుట్టుతలఁపుల్ బాహాటమై; యీశ్వరా!
దయసేయం గదె గాంగనిర్ఝరసదృగ్ధారావాగ్ధాటి, త
ద్వయశక్తిన్ వణఁకుట్లు వెల్వడ; ననంతా! భక్తచింతామణీ. ౪

## భగవన్మహిమాదివర్ణనము.

—:o:—

శా. ఓనిర్హేతుకజాయమానకరుణా! యో నిర్వికారప్రభూ!
యో నిర్వ్యాజపరోపకారసుకృతీ! యో నిత్య! యో నిర్మలా!
యో నానాంతరయామి! విశ్వసృజ! విశ్వోపాస్య! విశ్వాత్మకా!
జ్ఞానానందమయస్వరూప! వరదా! సద్భక్తచింతామణీ. ౫

మ. ప్రకటత్వద్గుణరాసులం గొలుచుచోఁ, బాథోధివార్బిందువుల్,
సకలక్ష్మాతలరేణువుల్, గగననక్షత్రంబు, లత్యంతసం
ఖ్యకు నొక్కొక్కండుగ, సల్గకినఁ బరమాత్మా! చాలునో, చాలవో?
యకలంకాంచదనంతభవ్యగుణధామా! భక్తచింతామణీ. ౬

మ. పదలాలిత్యము, వర్ణగౌరవము, భావవ్యక్తి, సారస్యసం
పద, నానార్థభ్రమల్పసల్, గుణగుకావ్యం బౌకఁ బోలె, ని
న్నెదలో మెచ్చి నుతింపఁజేయదె భవత్సృష్టప్రపంచంబు? ప్రమొ
క్కెద, ముద్దాడెద, నీపదంబు లనురక్తిన్; భక్తచింతామణీ. ౭

శా. నాడుల్ వాఁగులు; రోమముల్ తృణలతల్; నానాస్థు లశ్మంబు; లీ
జాడన్ నేర్పున సంగ్రహించితివి విశ్వం బెల్ల మామేనులన్;
జూడన్ నీవు మహాత్మ్యతకళాయుఁడ; వీచోద్యంబులం గన్న, నిన్
వీడం జాలునె వెఱ్ఱివాఁడయినఁ? దండ్రీ! భక్తచింతామణీ. ౮

మ. ఉదయంబందున మేలుకొల్పి, పగ లెంతో ప్రీతితోఁ బెంచి, రేల్
నిదురం బుచ్చుచుఁ బెక్కుమార్లు జగముల్ నిర్మించి, రక్షించి, యా
పద నొందించుట, నీవినోద మని విస్పష్టంబుగా నిట్లు చా
టెదు గా ప్రత్యహ మెల్లవారలకుఁ; దండ్రీ! భక్తచింతామణీ. ౯

మ. పసుముల్ వేసుక బొమ్మరిండ్లిసుకలో బాగొప్ప నిర్మించి, చొ
ప్పడ ముగ్గుల్ పచరించి, యాడుకొని, యాపై నాటగొల్లంచుఁగ
ట్టడముల్ పాడొనరించి పోవుగతి, వేడ్కల్ నీకు నీవిశ్వముల్
పాడమం జేసి, భరించి, మాపుటలు నెప్డున్; భక్తచింతామణీ. ౧౦

మ. గొనముల్ మూఁటిని సంగ్రహించుకొని, బొగ్గుం గారమున్ గంధకం
బును బోలెన్ దగఁ బాళ్లు వేసి, భువనంబుల్ మేటిలంకాపురుల్
గను నిర్మాణముఁ జేసి, పోర్చి, తుద కెల్లన్ రూపుమాయింతు వే
డ్కను, సృష్టిస్థితినాశకారణుఁడ వౌటన్; భక్తచింతామణీ. ౧౧

మ. ధునీనాథుండు నిజాంగకంబు లెటు లట్టుల్, లోకముల్ నీవు కా
శల మొప్పన్ వెలిఁగార్తు, లోనఁబెత్తు విచ్ఛామాత్ర; నీకుక్షిఁ జీ
వులు పుట్టం బలె నెన్నియో నిముసు బ్రహ్మాండంబు; లాకాశముం
బలె నీ వంతట నిండి యుందు; పరమాత్మా! భక్తచింతామణీ. ౧౨

శా. నీసంకల్పమె సృష్టి; నీవు గనుఁగొంటే రక్ష; నీ వూరకుం
టే సంహారము సూ; మహాత్మ! యేటు గా కీభూమి, యీసాగరం
బీసర్వాద్భుతజాతకోటి, యిఁక వేఱేలా సర్గంబు గా
నీ, సంరక్షణ గాని సేయుఁదర మానే? భక్తచింతామణీ. ౧౩

మ. ఎదురం దండముఁ జేతఁ బట్టుక, నిజాధీశుంకు చూపట్టినన్,
దుదకున్ సేవకు లెట్టులో యతనికన్నుల్ గప్పి వర్తింతు; రే
మిది, నాన్నెన్నఁడుఁ జూడ కుండియును దండీ! విశ్వమింతైనఁ ద
ప్పదు నీయానతి; యద్భుతావహము; దేవా! భక్తచింతామణీ. ౧౪

మ. నిముసం బైనను విశ్రమింపఁ డొకచో నీరేజమిత్రుండు; సం
ద్రము దా నించుక మీఱదు; జగత్ప్రాణుండు వీచున్ సదా;
క్షమ సర్వంబు వహించు; నీరదము వర్షంబిచ్చుఁ గాలానుసా
రముగా; నీ వతిచండశాసనుఁడ వౌరా! భక్తచింతామణీ. ౧౫

మ. జగ మన్యోన్యవిరుద్ధవస్తువులతో సంపూర్ణమై యుండియున్
దగవుం, ధర్మముఁ గల్గి వర్ధిలుట కాధారంబు నీవే గదా!
పగ సాధింతు మటంచు దుర్మదమునన్ బాపాత్మకుల్ రేఁగినన్,
సిగ పూ వాడఁగ నీవు సాధులను; దండ్రీ! భక్తచింతామణీ. ౧౬

మ. ఫలభారంబున వంగువృక్షమును గాపాడంగఁ బో టొగ్గున
ట్టులు, ధర్మప్రతిపాలనైకరతిఁ గీడు ల్మాఁడు పుణ్యాత్ము న
ర్మిలి రక్షింతువు నీవ యడ్డపడి; తండ్రీ! ధర్మ మేపక్ష మ
వ్వలనం దోడ్పడ వేచి యుండుదువు గాదా? భక్తచింతామణీ. ౧౭

మ. కురియన్ వానన, గాలి, మబ్బులు, మెఱుంగుల్, గర్జలున్, గూడునై
ఝరి, బాగోగులు రాఁగలట్టితఱిఁ, దత్కార్యానుకూలంబుగా
ధరఁ బ్రోగయ్యెడు నెక్కడెక్కడనొ నీతంత్రంబునన్; జిత్ర మె
వ్వరు నీచిత్తమెఱుంగ రాఫలము! దేవా! భక్తచింతామణీ. ౧౮

శా. నీకుం బ్రేమ సమాన మన్నిటియెడన్; నిక్కంబు సర్వేశ! యీ
లోకంబందు సమస్తజంతువుల కెట్లో నిత్య మాహార మీ
వే కావే దయసేయు చుందుదువు? తండ్రీ! యట్లు గాకున్న, మం
దాకం బేక్రియ తాతిలో బ్రదుకు నుండెన్? భక్తచింతామణీ. ౧౯

మ. కరదీపప్రభ ముందటం బురుగు ఱెక్కల్ వోలె, ఱిక్కల్, గ్రహో
త్కర, మెవ్వానిపవిత్రసన్నిధిని నాకాశంబునన్ వెల్గు న
త్యురుతేజంబున, నట్టి నీనిరుపమజ్యోతిర్మయాకార మాం
తరదృష్టిం గను యోగి; యొండ్లతర మౌనా? భక్తచింతామణీ. ౨౦

మ. వెలుఁ గొక్కండ యఖండ మీవె యభవా; వేవెల్గు, రేవెల్గు, జు
క్కలుఁ, గ్రొక్కారుమెఱుంగు, లర్చులు మొదల్గా వెల్గు లెన్నన్ని నీ
కళలే; యేకము నందుఁ దోఁచెడు ననేకంబుల్ భవన్మాయ; నీ
తెలివిన్ సర్వము నిన్నె కాఁదలఁతు బుద్ధిన్; భక్తచింతామణీ. ౨౧

## భగవత్సేవ.

---

శా. వేదం బంతయు లక్షణం, బఖిల మా విశ్వంబు లక్ష్యంబు గా,
వాదిగ్రంథము నీ వొనర్చితివి సర్వార్థప్రదర్శంబుగా;
నో దేవా! యది లెస్సగాఁ జదువు ధన్యుల్, సంశయాపేతులై
మోదం బొందుచు నిన్నుఁ గొల్తు రనిశంబున్; భక్తచింతామణీ. ౨౨

మ. మనుజుల్ భిన్నపదస్థు; లందఱకుఁ దా మధ్యాహ్నమం దవ్విధిన్
గనుపట్టున్ రవి నూటిగాఁ దలను నాకాశంబునం దవ్విధిన్,
నిను ధ్యానించెడువారి కెల్ల నెదుటన్ నీరూపు మాపట్టు, నో
యనఘా! హృద్గగనంబునందు; మునివంద్యా! భక్తచింతామణీ. ౨౩

మ. పులకింపం దను వెల్ల జల్లుమని, యుప్పొంగంగ సర్వాంగముల్,
గళమున్ గద్గదికం దగుల్ కొన, వడంకం గాలు సేతుల్, ముద
శ్రులు ముత్తెంబులు వోలె రాల, నెదురం జూపట్టుచున్నట్టె, నిన్
గొలువం గల్గుసుఖంబు యోగియె యెఱుంగున్; భక్తచింతామణీ. ౨౫

శా. రారాజున్ నినుఁ గొల్చుగౌరవము, భూరాజుల్ భజింపంగ నే
లా రా నేరుచు? సార్వభౌములును బాదాక్రాంతులై మానులన్
దా రారాధన సేత నిగ్గనియె కాదా; మేఁకయున్ సింగపుం
గారుణ్యంబునఁ గాన నిర్భయ మగుం గా? భక్తచింతామణీ. ౨౫

మ. జలధిం గాలినడం దరించు, ఘనపాషాణంబు దేలించు, మ
జ్జ్వలదగ్నిం గమలాకరాంతరము నోజం జొచ్చి యేతెంచు, ని
శ్చలభక్తిన్ నిను నమ్మి కొల్చునరుఁ; డో సర్వేశ! నీసేవకా
వలికిం దుష్కరమున్నదే యొకటి? దేవా! భక్తచింతామణీ. ౨౬

శా. పాపారణ్యదవానలంబు, శుభకృత్ప్రారంభబీజాంకుర
శ్రీపర్జన్యము, కామరోషముఖవైరిక్ష్వేళభృద్గారుడం,
బాపద్ధ్వాంతవిభాకరోదయము, మోక్షానందకందం, బహో!
నీపాదస్మరణంబు జీవులకుఁ; దండ్రీ! భక్తచింతామణీ. ౨౭

మ. తలిదండ్రుల్ భళిరేఁ దప్పు లోఁ గొనుచు వాత్సల్యంబునం బ్రోతురు, స
చ్చెలియుం బోలె సుధామయోక్తులను మానేమం బెఱింగింతు; కే
వలధర్మప్రభుపట్లు నీపరిజనయిబ్బందుల్ ద్రోలంగింతు; ని
న్నెలమిం గొల్వమి మాయభాగ్యదశ గాదే? భక్తచింతామణీ. ౨౮

శా. దేవా! నీ వొనరింతు శిక్షలని భీతిం జెంది, నీపాదముల్
సేవింపన్ దలపోయుకంటెఁ, గరుణాసింధూ! భవత్ప్రాణిర
క్షావైదగ్ధ్య మనుక్షణం బనుభవజ్ఞానంబునం గాంచుఁ, బ్రే
మావిర్భూతిన నిన్నుఁ గొల్చుట పరం బౌ; భక్తచింతామణీ. ౨౯

మ. తనుఁ బోషించెడుతల్లిదండ్రులయెడన్, తన్నేలుభూపాలుపా
లను, దన్ దిద్దు ఘనోజ్జపట్లఁ, దనకున్ లగ్గొమొసన్మిత్రుపైఁ,
దనతోఁ జౌనుపకారికైన, నెన రొందన్ జేర్పఁగా కే పరియో
జన మస్మత్పరిచర్య నీకుఁ? బరమేశా! భక్తచింతామణీ. 30

శా. తానంబుల్, తపముల్, జపంబులు, మహాదానంబులున్, దీర్ఘసే
వానిష్ఠానియమాదు లంతగ భవద్భావంబు రంజింప లే,
వానందాశ్రునిమీలితాక్షమును, సర్వాంగీణరోమాంచ మా
నీనిశ్చలభక్తిపోలికను; దండ్రీ! భక్తచింతామణీ, 31

మ. నడివేసంగి, నెడారి, బగ్గమును నెండన్, మట్టమధ్యాహ్నము
ప్పు, డుదన్యార్దితుఁ డైనపాంథుఁ డమృతంబున్, నీడయో, గోరుకై
వడి, సంసారమునందుఁ దాపముల కోర్వన్ లేనిమర్త్యుండు, నీ
యడుగుల్ దక్కఁ, మఱేమి గోరఁడు గదయ్యా? భక్తచింతామణీ. 3౨

శా. ఏనుం గెక్కినవాఁడు గుక్కలకుఁ దా నేరీతిగా జంకక
త్యానందంబున నేగునో, యటు తనూయాతన్, జగన్నాథు ని
న్నే నిక్కంపుసహాయుఁగాఁ గొనినరుం డేయాపదల్ వచ్చినన్
వానిన్ లక్ష్య మొనర్పఁ డించుకయు? దేవా! భక్తచింతామణీ. 33

మ. కవచంబున్ ధరియింప, మేని కది మేలా? పోను గాకుండు నా
హవమందున్? హృది నిన్నుఁ దాల్చిన, భూమ్యాకాశ తేజఃపయః
పవనోద్భూతచరాచరంబులను నేభంగంబు దేహాత్మ లొం
దవు; నిస్సంశయ మిందు నందుఁ; బరమాత్మా! భక్తచింతామణీ. 3౪

శా. నాసామర్థ్యము గన్న, నా దెసఁ గనన్, నాయక్కఱల్ గాంచినన్,
నాసంసారము గన్న, నామనసు గన్నన్, నావిధుల్ గాంచినన్,
నీసాంగత్యము, నీసహాయతయుఁ, దండ్రీ! ముఖ్యమం చెంచ న
య్యా? సర్వేశ్వర! నాకు నన్ దెలుపు; దేవా! భక్తచింతామణీ. 3౫

మ. అయయో! నిన్ను నెఱుంగ కున్నఁ, బరమాత్మా! మాకు ధర్మప్రవృ
త్తి, యధర్మనివృత్తి, దుష్టసహనస్థైర్యాప్తి, యాపన్నివృ
త్తియుఁ, దాపత్రయశాంతి, యభ్యుదయభూతివ్యాప్తి, సత్యానుర
క్తి, యసత్యాతివిరక్తి, ముక్తియును గద్దే? భక్తచింతామణీ. 3౬

మ. నిను నే మిత్త్రునిఁగాఁగఁ జేసికొనినన్, నిక్కంబు, లోకంబులో
నను నాకెవ్వఁడు శత్రు వుండఁ; డఖిలాంతర్యామి నీవేకదా?
యనఘా! నాకెపు డెందు కీడు మమ సంప్రాప్తించినన్, భీతి నొం
దను; నీ వెల్లెడఁ దోడ నుందు; పరమాత్మా! భక్తచింతామణీ. 3౭

మ. ధనికుం డార్జనరక్షణవ్యయములన్, దైన్యంబునం బేదయున్,
జను లిట్లందఱు దుఃఖ మెల్లఁ గొనఁగా, సౌఖ్యంబు, నానందమున్
బని లేకిక్కడ, నిన్ను చేరుగనె; నీపాదంబు లేఁ గొల్తు; వా
నిని జీతంబుగ నాకు నీఁగదవె; తండ్రీ! భక్తచింతామణీ. 3౮

శా. నీకారుణ్యము నాపయిం గలుగుపాంటెం, బెద్దకాలంబు నే
నీకు న్నిశ్చలభక్తి సేయవలయున్; నీచిత్తమే వచ్చినన్,
నాకోర్కుల్ నెఱవేర్తు వాక్షణము యత్నం బేమి లేకుండ నే;
నీకై జంకను; నాకె నీ వెఱతుఁ; దండ్రీ! భక్తచింతామణీ. ౩౯

మ. త్వరతో నీవు మదీప్సితార్థము ఫలింపం జేయ లేదంచు నేఁ
బరుసంబాడ నిరాశతోడ; నెద విశ్వాసంబు వీడన్; నిరం
తరమున్ నిన్ ధృతిఁ గొల్చువాఁడ, బ్రభుచిత్తం బెత్తఱి న్వచ్చునో!
కరుణాఖండవు, ధర్మమూర్తి వకలంకా! భక్తచింతామణీ. ౪౦

మ. తరువల్ల్యాదుల వైనపుష్పఫలపత్త్రంబుల్, నదీతోయముల్,
సరిగా నక్కఱ కబ్బునయ్యా? యవి యోస్వామీ! పరాధీనముల్;
గరిమన్ భక్తిరసాభిషేచనము నేఁ గావించి, యమ్లానహృ
త్సరసీజార్పణ నీ కొనర్తుఁ; బరమాత్మా! భక్తచింతామణీ. ౪౧

---

## సానుతాపప్రార్థనము.

---

మ. జననీగర్భములన నుండఁగ విదేశం బేగి, పెక్కేండ్లకున్
జనుదేఁ, దండ్రిని గాంచుబిడ్డవలె, నీసంబంధమున్ ముందు నేఁ
గన కీవేళ నెఱింగి, స్నేహభయశంకాయుక్తప్రాశ్చర్యభా
జనమై నిల్చితిఁ; జేరఁ దీసికొనవే, సద్భక్తచింతామణీ. ౪౨

మ. జనకుం డిచ్చినసొమ్ము దుష్క్రియల వెచ్చంపెట్టి, రోగార్తుఁడై,
తనుఁ గ్రోవం బలిమాలుపుత్త్రుగతి, బోనం బెల్ల దోషైకవ
ర్తనలం జొన్పి, మహాపరాధి నయి సంతాపించెదన్ దీనతన్;
నినుఁ గాపాడెద వోడకుండు మను; తండ్రీ! భక్తచింతామణీ. ౪౩

మ. మనుజుండై పశువాటకంటెఁ బశుజన్మం బెత్తు, నీ వెట్లు దా
నిని బుట్టించితి వట్లు చేయుమ -; హా! నిర్భాగ్యతన్ జ్ఞాన మె
ల్లను వ్యత్యస్తముఁ జేసి నీ విధుల నుల్లంఘించెదన్ నేను; దం
డన కర్హుండను బ్రోవవే నను దయన్; సద్భక్తచింతామణీ. ౪౪

శా. సేవింతున్ భవదీయపాదజలరుట్చింతానుపానంబుతో
దేవా! మందు; ననామయత్వముఁ బ్రసాదింపంగదే మేనికిన్;
బ్రావృణ్మేఘము ప్రాపు గల్గినను, దావం బేర్చునే వృక్షమున్?
నీ వుండన్ హృది, నాకు వ్యాధిభయ మున్నే? భక్తచింతామణీ. ౪౫

శా. నాతో నిత్యముఁ బథ్యపున్మెతుకులన్ వంజం దొరంకొంటి, వ
య్యో! తండ్రీ! యసమర్థు పేరిమయిది; నే నుల్లాఘుఁడం గాన నీ
చేతోవీథిఁ దలంచినంతన? ప్రభూ! చేకూర్పవే షడ్రసో
పేతాన్నంబు వేదనం బిడి కానన్ వే; భక్తచింతామణీ. ౪౬

శా. స్వాదుల్ చేఁదులు సేర్చి నీ వెదురఁ గుప్పల్ వోయఁ బట్ట, డ్లందునో
చేఁదుల్ మేము భుజించి, ఘోరరుజలం జే టొందుచున్నాము; నీ
పాదధ్యానసుధారసం బొకటి దప్పన్ వాని కేమందు లే;
దో దేవా! యది గ్రోల్చి కావవె; కృపాబ్ధీ! భక్తచింతామణీ. ౪౭

శా. పాముల్ గప్పలఁ బట్టి మ్రింగుగతి మాపాపంబులే వ్యాధులై,
మా మేనుల్ కబళించుచుండ, విడిపింపం జాలి వీక్షించుటల్
మామీఁదన్ నెన రేదియో, పరుల హింసల్ నీవినోదంబులో,
స్వామీ! కావవె, యార్తరక్షుఁడవు గావా? భక్తచింతామణీ. ౪౮

మ. కరముల్ దుర్గ్రహణాదికర్మముల, నాల్కల్ తుచ్ఛదుర్భాషలన్,
జరణంబుల్ చనరానిచోట్లఁ జనుటన్, జక్షుస్త్వగాదీంద్రియో
త్కరమున్ దుర్నయవృత్తులన్, హృదయముల్ క్రౌర్యాదులన్, మైలయౌఁ;
బరిశుద్ధత్వ మొసంగు మాకు నినుఁ గొల్వన్; భక్తచింతామణీ. ౪౯

శా. క్షేత్రిస్వామిని జూడ కుబ్జ పశువుల్ చే న్మేయఁ బడ్డట్లు, నా
నేత్రాదీంద్రియముల్ దురాశలను దుర్నీతిం బ్రవర్తించుచు, వి
శ్వత్రాణుం బరమాణురూపు, నినుఁ గాంచన్ లేరు; సద్గోపచా
రిత్రా! నన్ జెఱఁ బెట్టకే కరుణఁ; దండ్రీ! భక్తచింతామణీ. ౫౦

శా. నానాభంగుల దుర్మదేంద్రియకరీంద్రంబుల్, దురాశావశా
ధీనస్వాంతములై వశంపడక వర్తించున్; సదా త్వత్పదా
లానంబం దనురాగశృంఖలలతో డగ్గి వాని బంధింప, వి
జ్ఞానాంకూరపరాంకుశం బొసఁగవే; సద్భక్తచింతామణీ ౫౧

మ. కలుషాల్, దామరపూవులున్, మనుజులోఁ గన్నాంచు బాలుండనై, లోఁ
గలలోఁ దెంచక, వాని కందు దిగి నున్నల్ వేయుచందంబునన్,
బలుసంసారమునందు భోగపంతన్ మున్గడనై, మోహప
ల్లులఁ దొల్గెంటిని; నుద్ధరింపవె కృపాంబూ! భక్తచింతామణీ. ౫౨

మ. జలధిం బోరయి నావచందమున సంసారంబునన్ దొక్కమా
టలమి న్నందునుఁ, గూలుమన్ మరల, సర్వావస్థలందున్ భయం
బలమంగా, నెవ్వ దేమి నూఁడ నో యంచు చాల్చుండనై కొల్చెద; వ
త్సలతన్ బారము సేర్పు బాగుగఁ; బరేశా! భక్తచింతామణీ. ౫౩

మ. అనఘా మున్నొకకీడు సేయ; నికఁ జేయం బోవు నా కెన్నఁడున్ గ
లుపాత్ము డనన్, నాదుపాపఫలముల్ గాలానుసారంబుగాఁ
గలుగన్ నే భుజియింతు; నైనను భవత్పాదాబ్జపూరంబునన్
దొలఁగుం బంకము లన్నియంచు నినుఁ గొల్తున్; భక్తచింతామణీ.

మ. ఇది మే లియ్యది కీడటంచు, మది నూహింపంగ రాకుండుచి
న్నదశన్, జీకటియందు దివ్వె బలెఁ గైకోఁ గద్దెగా నిన్, సుఖా
స్పద మామార్గము దోఁచు; నేఁచుదురవస్థల్ పంచబంగాళే మాఁ;
దమాల్యస్మృతి నిల్పు నా కెపుడనంతా! భక్తచింతామణీ. ౫౫

మ. ఫలపర్ణప్రసవాదులన్ భవదనల్పప్రౌఢశిల్పంబుఁ గ
న్గొని యానందజబాష్పముల్ దొరఁగఁ గన్పట్టన్, "దేవ! మాగోంటుఁ జేఁ
తల నమ్మాఁ గృతి నిట్టియద్భుతచమత్కారంబు; హా!" యంచు, నెం
జిలి నీ కంజలిఁ గూర్తు, నన్ సయిఁప దోషిన్; భక్తచింతామణీ. ౫౬

శా. అజ్ఞానంబున సల్పుదుష్కృతము లెన్నెన్నొ యుండునో కాని, నీ
యాజ్ఞ న్మీఱి యెఱింగి చేసినవి యే హా! లెక్కకున్ మీఱె; స
ర్వజ్ఞా! నామది నిష్ఫలం బొరలు చేవన్ బొక్కెడున్; మామకా
వజ్ఞల్ సైఁపవె; పాపవే వెతల; దేవా! భక్తచింతామణీ. ౫౭

శా. ఎన్నో పాపము లాచరించితిని; న న్నేదారి రక్షించెదో?
నిన్నే తల్లిగఁ, దండ్రిగా, గురువుగా, నిక్కంపుమిత్రంబుగా,
మన్నింతు న్మది, నాయఘంబులు క్షమింపన్ గానివే; యైన, నేఁ
గన్నీ రోడిక గట్టుఁ గాళ్ళఁ బడితిం గా; భక్తచింతామణీ. ౫౮

శా. తిత్తుల్ జో డమరించి యూఁదు కొలిమిన్, దేవేశ! యున్నట్లు, ప
శ్చాత్తాపంబునఁ దప్తమై, యిపుడు నిష్కల్మషమై, మెత్తనై,
చిత్తం బున్నది; వెండియుం గఠినమై చేటొంద కుండంగ, స
ద్వృత్తిం జేయవె నెయ్యపుంబరుసవేదిన్; భక్తచింతామణీ. ౫౯

శా. పిన్నం గారడివాఁడు యింతగ మహావేణ్వగ్ర మెక్కించులా
గెన్నన్ మానవజన్మ ముత్తమము న న్నెత్తించి తీ వజ్ఞు; న
న్నన్నా! హానికరంబు సు మ్మది; మహాత్మా! కాచి యెట్లుండెదో?
నిన్నే నమ్మిక యున్నవాఁడఁ జుమి; తండ్రీ! భక్తచింతామణీ. ౬౦

శా. పాపాత్ముండను; బాపసంభవుఁడ; నేఁ బాపంబులే సల్పుదున్;
బాపిన్; బావన! పావనాత్మ! నను నిష్పాపుం బొనర్పంగదే?
నీపాదంబులె దిక్కు గాని యిఁకఁ దండ్రీ! నాకు నే దిక్కు లేఁ;
డాపద్బాంధవ! కావుకావు నను; దేవా! భక్తచింతామణీ. ౬౧

శా. కించిజ్జ్ఞత్వము మేలు కీడనుచునుం, గీడెంతొ మే లంచుఁ, దో
పించుం; గావున మాకు నేర్పు లుడుగన్ వేఁ గిష్టముల్ గష్ట; మీ
వెంచన్ సర్వవిదుండవుల్, హితుఁడ; వేయేయుక్కుఃల్ మాకుఁ బ్రా
ప్తించుల్ దీర్చవె వాని నెల్లను; గృపాబ్ధీ! భక్తచింతామణీ. ౬౨

శా. ఏవో వచ్చియు రాని తొక్కుటనుకు లట్టిట్టంచుఁ బోర్వెట్టఁ, ద
ద్భావం బారసి తల్లిదండ్రులు స్వసంతానంబు నూరార్పరే?
నావాక్యంబు లపూర్ణభావము లసందర్భార్థబంధంబు; లో
దేవా! యుల్ల మెఱింగి కావు శరణార్థిన్; భక్తచింతామణీ. ౬౩

మ. ఫలవృక్షంబులఁ బండ్లు, బువ్వములు పువ్వుదిచ్చుటల్, భైరులన్
బలుధాన్యంబులు గల్గ కుండినను, దద్భావంబు శూన్యంబ కా;
యిలలో నన్ను నవంధ్యుఁ జేయఁగదవే యీశా! భవద్భక్తికిన్
జెలువై యొప్పగుసత్ఫలం బొసఁగి; తండ్రీ! భక్తచింతామణీ. ౬౪

మ. ధనముల్, ధాన్యము, లిండ్లు, వాకిటులు, గాంతల్, సంతతుల్, వస్త్రవా
హనముల్, దోఁటలు, దొడ్లు, భూములు, సమస్తైశ్వర్యముల్ గూడ నీ
యనుకూలత్వము లేనియప్పుడు మహానర్థంబులున్, దుఃఖవ
ర్ధనముల్; గాన నొసంగు దీవన; లనంతా! భక్తచింతామణీ. ౬౫

మ. ఇది మే లియ్యది కీడటంచు, మది నూహింపంగ రాకుంకుచి
క్కుఁ దశన్, జీఁకటియందు దివ్వె బలెఁ గై కోఁ గల్గినా నిన్, సుఖా
స్పద మామార్గము దోఁచు; నేఁచుదురవస్థల్ పంచబంగాళ మౌఁ;
దదమూల్యస్మృతి నిల్పు నా కెపు; డనంతా! భక్తచింతామణీ. ౬౬

శా. దూరస్థంబు వగాగ్రసంస్థుల కెటు ల్దోఁచు న్సమీపస్థము,
ట్లారీతిన్, గతమాగతంబుఁ బ్రత్యక్షం బట్లొఁ గన నీకు; నో
నీరేజాప్తహిమాంశునేత్రయుగళా! నేఁ గూపకూర్మంబ; నా
నేరంబుల్ క్షమియింపు; గో డుడుపు; తండ్రీ! భక్తచింతామణీ. ౬౭

ఉ. తలిదండ్రుల్, గురువుల్, సహోదరులుఁ, గాంతాసంతతుల్, బంధువుల్,
చెలు, లర్థుల్, పరమోపకారు, లతిథుల్, శిష్యుల్, ప్రభుల్, భృత్యు, లా
ర్తులు, దీనుల్, వికలాంగు లిం దెవరి కేరూపంబునన్ జూడఁగా
వలె, నన్నట్టులు దిద్దు వారియెడ; దేవా! భక్తచింతామణీ. ౧౮

శా. శారీరావయవంబులుం బలెఁ, బృథక్సామర్థ్యసాధ్యోన్యవి
స్తారాపేక్షమిథస్సహాయములు గా, సర్వేశ! నిర్మించితీ
వౌరా! స్థావరజంగమాత్మక సమస్తాజాండముల్; మ మ్మెటుల్
చేరెన్ స్వార్థపరత్వ? ముంప కది తండ్రీ! భక్తచింతామణీ. ౧౯

మ. వనమం దాకులు గాలిచేత బలె, విశ్వంబందు జంతూత్కరం
బనఘా! మృత్యువుచేత రాల్పఁబడి, మన్నై పోయెడున్; మోక్షసా
ధన మీమేను వృథా నశించు నని సంతాపించెదన్; వేగ మీ
తను వెత్తించిన మే లొసంగు; పరమాత్మా! భక్తచింతామణీ. ౨౦

శా. పగ్గాలం బలె నాసల న్విషయముల్ బంధించి త న్నీడ్వఁగా,
సిగ్గింతైనను లేక, సంతసిలు నాచిత్తంబు; తద్బంధముల్
నుగ్గై నిత్యసుఖంబుఁ బొందుతెరువున్ జూడంగ లే కున్న; దీ
యొగ్గు న్మాన్పి, తిన్నఁజేయు మది; తండ్రీ! భక్తచింతామణీ. ౨౧

మ. “కడి యన్నం గబళింప నోరు దెఱచున్; గళ్లెం బనన్ మాయ,” య
న్నుడి సత్యంబు; సుఖంబు లాసపడెదున్; యుక్తక్రియల్ గిట్ట; దీ
చెడుచిత్తంబును దియ్యనీటివడికిం జేపం బలెన్, నీదుక
ట్టడ కిష్టంపడఁ జేయవే దయ నఖండా! భక్తచింతామణీ. ౨౨

మ. అనఘా! నీవెఱ పన్నసేతువు, దృఢంబై చుట్టినంగాక, నా
మన సన్ చంచలవారిపూర మికఁ నెమ్మె నీచమార్గంబులన్
జనకుండున్? పరమాత్మ! యెవ్వ డెట దుష్కార్యంబు సేఁ జేయఁగో
రిన, నీ విప్పుడ తోఁచి మాన్పు మది; తండ్రీ! భక్తచింతామణీ. ౨౩

శా. న్యాయం బొప్పులఁ దప్పులం గలుగు నిన్నే బట్టి; కాఁబట్టి న
న్న్యాయంబంబున కే నొరుల్ వొగడ, నిన్న్యాయంచు మోదింతు; వ
ర్లే యేరేఁ దగడంగ నన్నుసుమ, మాయింపంగ నాతప్పు, ని
న్నాయయ్యా! బతిమాలుకొందుఁ; బరమాత్మా! భక్తచింతామణీ. ౭౪

మ. పదిలంబై యఱుతన్ దనర్చుసరముల్, బల్చేటులన్ విస్మృతిన్
వెదుకం బూనినవానిచందమున, నే విజ్ఞానహీనుండనై,
హృదయాంభోజమునందుఁ దేజరిలు నిన్నెందెందొ భావింతు; నె
మ్మది నిం జూడఁగ జ్ఞానలోచనము నిమ్మా; భక్తచింతామణీ. ౭౫

శా. ప్రాణాపాయమునందు వీడుదురు భార్యాపుత్రమిత్రాదులున్;
బ్రాణత్యాగమునప్పుడున్ విడువ వాపద్బాంధవా! నీవు; నా
ప్రాణం బస్థిర; మంత్యవేళ నను రక్షింతున్, భవద్ధ్యానపా
రీణస్వాంతు నొనర్పు; మోయఘవిదారీ! భక్తచింతామణీ. ౭౬

మ. గెలిపింపంగదె ధర్మ మెల్లపుడు; రక్షింపంగదే దీనులన్;
గొలిపింపంగదె నీపదాంబుజములన్; గుయ్యాలకింపంగదే;
తలఁపింపంగదె నీదుపేర్మి; మదపరాధంబుల్ క్షమింపంగదే;
వెలయింపంగదె నిన్నుజన్మ మెద? దేవా! భక్తచింతామణీ. ౭౭

శా. ధర్మాఖ్యంపుఁబునాదిమీఁదఁ గద ధాతా! సర్వలోకంబులన్
నిర్మాణం బొనరించి నాఁడవు; సహింతే మూలబంధం బయో
దుర్మార్గుల్ చెడఁ గొట్టుచుండఁ గని తద్దోషంబు, బ్రహ్మాండముల్
నిర్మూలక్షితిజంబు లౌఁ గదవె తండ్రీ! భక్తచింతామణీ. ౭౮

## భగవదుపకారస్మృతి.

---

శా. ప్రాలేయాచలతుంగశృంగములపై భాగంబునందుండి యీ
భూలోకంబున దూఁకు నాకఝరిఁ దుంపు ల్గన్ని సంధిల్లెనో,
యాలెక్కన్ సరిదేల్పు మేటిగణకుం డర్హుండో, కాకేఁ డికన్
జాలుం దేవ! భవత్కృతోపకృతు లెంచన్? భక్తచింతామణీ ౭౯

శా. ఎన్నో తప్పెను బ్రాణగొడ్డములు నా దేయత్నమున్ లేకయే;
చెన్నంటుల్ చెఱుపం దలంచిన, లభించెన్ మేలు లెన్నేని; నీ
కన్న న్వేనికిఁ గారణం బెవరు పైగాఁ? బిల్లలం దల్లిలా
గెన్నం డేమఱ; వెట్లు ని న్మఱతుఁ? దండ్రీ! భక్తచింతామణీ. ౮౦

శా. అన్నంబం దుదకంబునందు, గృహశయ్యాయానపీఠంబులం
దు, న్నానావిధలీలలం, దఖిలమందు న్నీకృపే తోఁచు; నో
యన్నా! మాకు నిమేషమున్ బ్రదుక శక్యంబె స్వశక్తిన్ భువిన్?
న న్నీవే బ్రతికింతు రేపగ లనంతా! భక్తచింతామణీ. ౮౧

మ. మలుతోడన్ మలు వుచ్చునట్లు; కరుణాంభోరాశి! నాకీడులం
బలుమా ఱీవు దొలంచినాఁడవు మహోపత్తుల్ ప్రయోగించి; నేఁ
దెలియన్ లే కుపకార మప్పటిమహోర్తిన్ దూఱితిన్ ని; న్నయో!
తులువన్, సైఁపవె నన్ను దీనజనబంధూ! భక్తచింతామణీ. ౮౨

శా. స్వప్నంబుల్ మొదలౌ నిమిత్తములచే, స్వప్నానలన్, సన్నగా
ముందే నాకు భవిష్యదర్థములచూప్పుం దెల్పు; దప్పొట ని
బ్బందుల్ రాఁగలవన్న, ని న్మఱఁకువన్ బ్రార్థించి, నీచాటునన్
యుందున్ వానికిఁ గానరాక; పరమాత్మా! భక్తచింతామణీ. ౮౩

శా. ఆపత్సింధువునం దగాధమగుచో నట్టిట్టు నేఁ గొట్టుకోం,
చేపట్టం గన కూపి రాడక భయాధీనుండనై, యార్తర
క్షాపారీణ! కృపానిధీ! యభయహస్తం బీవె దేవా! యనన్,
నాపై నెప్ప గదల్పవే దిగులు డిందన్? భక్తచింతామణీ. ౨౪

శా. ఏ డేండ్లప్పుడు నాదుతండ్రి, పదొకొం డేండ్లప్పు నాతల్లి, సై
దోడు, న్నన్నను, నీపదాబ్జములపై దుఃఖించుమన్ వైచిపో,
నాఁడారంభము, తండ్రి, తల్లి, గురువున్, దైవంబునై, మాకు నే
కీడు న్మూఁడక యుండఁ బ్రోతు వనురక్తిన్; భక్తచింతామణీ. ౨౫

మ. పరసిద్ధాంజన మిచ్చి యంధతను మాన్పన్, వెజ్జు సేవింపఁ ద
త్పరతన్ మానవుఁ; డత్తు లాదిగను సర్వం బిచ్చి రక్షించునిన్
స్మరియింపం, డకటా! కృతఘ్నతను; యుష్మజ్జ్ఞానభానుప్రభన్
విరియింపంగదె మాతమోభరము; తండ్రీ! భక్తచింతామణీ. ౨౬

మ. నిముసం బేమఱినన్ సమస్తజగముల్ నిర్మూలమౌఁ గానఁ బ్ర
హ్మము! నీఱెప్పలు వాల్ప వెప్డును; నీ కన్యంబు వేదిక్కుఁ గా
వమి, నీభక్తులవిన్నపంబు లెవి యైనం బ్రేమ నాలించి సే
మమె చేకూర్తువు; నిన్నె గొల్చెద మహాత్మా! భక్తచింతామణీ. ౨౭

మ. నిదురం గల్పన చేసి, దానివలనన్ దేహంబు, డెందంబుఁ, బ్ర
త్యుదయంబున్ సరిక్రొత్త సల్పెడుఁగతిన్, దుఃఖాదులన్ సర్వదా
మది, మై, చీఁకక యుండ, మాకు మఱి పన్మందున్ బ్రసాదించి; తి
ల్లెది నీసృష్టి, జగద్ధితార్థ మది తండ్రీ! భక్తచింతామణీ. ౨౮

మ. "అడుగ న్మానినఁ బెట్ట దమ్మ" యనుసామ్యం బౌరయన్, నీకు మా
తొడలం గల్గిన ప్రేమకు న్మిగులఁ దండ్రీ! యద్భుతం బయ్యెడున్;
బుడమిన్ మే ముదయంబు గాకమును పే, భూతేశ! కల్పింపవే,
కుడువం, గట్టఁ, దొడన్, సమస్తమును మాకున్? భక్తచింతామణీ. ౨౯

మ॥ అయ్యయో! మే మతిమూర్ఖచిత్తులము గామె? కన్న, గాల్, గూడుం,గు
డ్డయు, లే కార్తిని బొందువాండ్రఁ బలుగుండ్రం గాంచుచున్, మాకు న
ట్టియవస్థల్ దొలఁగించునీదయకుఁ దుష్టిం బొంద, కళ్యాణ నె
న్నియొ వాంఛింతు; మ వెల్ల నేమిటికిఁ? దండ్రీ! భక్తచింతామణీ. ౯౦

---

## ఉదయప్రార్థనము.

---

మ॥ అవివేకాంధ తమోనిరాకరణదివ్యజ్ఞానచక్షుఃప్రదా!
భవరోగార్తమహౌషధీశ్వర! జగద్బాహ్యాంతరవ్యాపకా!
రవికోటిప్రతిమాన! నైగమశిరోరత్నాయితాంఘ్రిద్వయా!
భువనాధార! పురాణపూరుష! స్వయంభూ! భక్తచింతామణీ॥ ౧౯

శా॥ చైతన్యార్క మరీచిగుచ్ఛశిఖలన్, సమ్మార్జితం బయ్యెడున్
చేతోవ్యోమతమఃపరాగము; నిసి స్లీనంబు మద్దృష్ట్యళి
వ్రాతం బక్షిసరోజకుట్మలదళాగ్రంబుల్ గదల్చెన్; మహా
కాశాండంబున కత్తు పక్షు లెగయున్; సద్భక్తచింతామణీ. ౯౩

మ॥ అవనిం బాఁతిన బెంక నాత్మ ణమ, సూక్ష్మాంకూరమున్, మోకయున్,
చివురుల్, కొమ్మలు, నాకులుం, బువులుఁ, బిందెల్, గాయలుం, బండ్లు, ను
ద్భవ మావృక్షము నైంద్రజాలికువలెం బల్విద్ర మేల్కొల్పి, లే
యవరూఢం బగువిశ్వముం దెలుపు; దీశా! భక్తచింతామణీ॥ ౯౩

మ॥ జనసంచారము పూర్తిగా నడఁగి, నిశ్శబ్దంబుగా నున్న ప
త్తనమున్ యామికుపోలికన్, విషయసంతానంబు గాఢప్రసు
ప్తిని లీనం బగుగాత్రి యెల్ల, జడ మాదేహంబు జాగ్రత్తతో
ననపాయంబుగఁ గాచినాఁడవుగదయ్యా! భక్తచింతామణీ॥ ౯౪

మ॥ చనుఁబాల్ ద్రావిలిచి, తొట్లలో నునిచి, పజ్జన్నిల్చి జోకొట్టుచున్,
గను మాయం, గను గల్గి తల్లి, నిసువుం గాపాడుచుండావ, భో
జనముం, దల్పి మనఃగ్రహించి, పవనస్పర్శంబునన్ నిద్రపు
చ్చి, నిసిం గావలి గావె మాకు? గుణరాశీ! భక్తచింతామణీ॥ ౯౫

మ॥ మును నే భ్రూణమను నాచు, మాతృజఠరంబుం జొచ్చి యున్నట్లు, శ
య్యను రేయెల్లను నిద్రనుండి, యుదయం బైనట్లు మేల్కాంటి; నా
కనులం బాపజగంబుఁ గన్గొనక మున్, గన్గొందు మే లొందఁ, బా
వనముల్ తావక పాదపద్మములు; దేవా! భక్తచింతామణీ॥ ౯౬

మ॥ తరుశాఖం గుసుమంబులుం బలె, భవత్కారుణ్యమూలంబునన్,
వరదా! మద్రసనం జనించినలసద్వాక్యంబులన్, నీ పదాం
బురుహద్వంద్వము విశ్వరూప! యిదె నేఁ బూజింతు నీవేకువన్;
బరిపాలింపవె పాపముల్ వొరయకుండన్; భక్తచింతామణీ॥ ౯౭

శా॥ గూటం బిచ్చుకకందు వెల్లవు డనుఁగుం దల్లి ధ్యానించుచున్,
దోఁటి న్విచ్చు నదేమి తెచ్చినను, సంతోషంబు, విశ్వాసమున్,
బాటిల్లంగను, నట్లు నీయెడల మద్భావంబు గావింప, ని
ష్కౌటిల్యాత్మరతిఁ గొల్తు నిన్నుదయ; మీశా! భక్తచింతామణీ॥ ౯౮

మ. ఎరకుం బిల్లలఁ దల్లికోడివలె, మ మ్మెందేఁ బగ ల్రిప్పు దీ
శ్వర; మే లోర్వక మాయగ్రద్ధ యెపుడేఁ బాపం జూచెడి న్నమ్మఁ; ద
త్షరపాదాహతి సోఁక కుండ, నను ఱెక్కల్ గప్పి కాపాడ, నీ
చరణద్వంద్వము నాశ్రయింతును సదా; సద్భక్తచింతామణీ॥ ౯౯

మ॥ తెలవారెన్; గను మూడఁగల్గె; నయినన్, దేవా! జగం బంతటన్
జలనచ్ఛన్నతమఃకుహూరజని నేచందం బటుల్ ముందువె
న్కల నే మున్నది గాన రాదు; నను నంధప్రాయుఁ, భద్రంబుగా
మెలఁగింపంగ ద సాయమై యెపుడు; సామీ! భక్తచింతామణీ॥ ౧౦౦

---

## సాయంప్రార్థనము.

---

శా॥ భావాతీత! భవాబ్ధిపోత! కరుణాపారీణ! దీనావనా!
సేవాప్రీత! పరాత్పరా! శుభకరా! చిద్రూప! సర్వేశ్వరా!
దేవా! నిత్య! నిరామయా! నిరుపమా! దివ్యాద్భుతప్రాభవా!
జీవాధార! ముముక్షుహృత్స్థలనివాసీ! భక్తచింతామణీ. ౧౦౦

మ॥ కొలఁకు ల్మ్రాని కులాయమూలములఁ బుల్గుల్ వ్రాలె, మాపాపముల్
డొలఁపిం జేసిక, నీయనుగ్రహముకల్మిం జేరుకొన్నార మి
త్తఱి మాగీములు; నేఁటిమానవతలం ద ప్పొప్ప లేమున్నవో,
తొలఁకే నీ; కపరాధముల్ సయిఁపు; తండ్రీ! భక్తచింతామణీ॥ ౧౦౨

మ॥ మునిమాపాటలు మాని, బిడ్డఁడు గృహంబుం జేర, మైనిండ నం
టిన పెంధూళికిఁ దల్లి యేవపడి, వానిం బోరుకాడింపదే?
దిన మెల్లం గలుషంబులే సలిపితిం; దేవా! మహాపాతకిన్;
నను ధౌతాత్మునిఁ జేయవే కనికరానన్; భక్తచింతామణీ॥ ౧౦౩

మ॥ ఎదురన్ ప్రేతపిశాచముల్ నిలుచునట్లే, ఘోరదుష్కృత్యముల్
హృదయాదర్శమునందు బింబితములై, యూరేయి నాకంటికిన్
నిదురం బాపెను నంచు బెగ్గిలుదు, నే నీనామమంత్రంబు ముం
దిద యుచ్చాటనకై జపించెదను; దండ్రీ! భక్తచింతామణీ॥ ౧౦౪

మ॥ ఉదయుం బాధి, హత్తరోపకృతులెన్నో చేసితి వీశ్వరా!
పద మైనం గదలింప శక్తులమె దేవా! నీ వుపేక్షించినన్?
సదయా! కంటికి రెప్పలాఁ గనుని మేపం బీవు తో డాటచే,
సుదినం బయ్యెను నేఁడు; గైకొను నమస్సుల్? భక్తచింతామణీ. ౧౦౫

శా॥ పొల్లున్ దంచినటుల్, మదీయకరణంబుల్ స్వస్వశక్తిన్, దినం
బెల్లం జూపెను నీరసక్రియలయం; దీశా! వృథా గాసిలెన్;
దల్లోపంబులు సైఁచి, భద్రసుఖనిద్రం జేర్చి రక్షింపవే,
యుల్లం బిప్పుడు వేఁడెదన్ నినుఁ; గృపాళూ! భక్తచింతామణీ. ౧౦౬

మ॥ ఇను వస్త్రాద్రికిఁ బంచి, చీఁకటిని పై కెక్కించి, తమ్మిన్ మొగి
డ్చినలా, గినిసి తెల్విఁ దోలి, నిదురం జేపట్టి రప్పించి, నా
కనుల న్మూయుదు; నీకుఁ గాలవికృతుల్ గా నెన్నఁడుం; గాన, బ్రే
మను గాపాడవె నన్ను రేయి; పరమాత్మా! భక్తచింతామణీ॥ ౧౦౭

మ॥ వెలుఁగున్, జీకఁటి, నీకు నొక్కటియ సూవే; పిల్లికే చీఁకటిన్
దెలియం జాలినకన్ను లిచ్చితివి; తండ్రీ! నీకు లేకుండునే;
వలు సైనం గనవచ్చుఁ జీఁకటిని, గొండ న్మించి; నీకంటికిన్
గలదే మాటు? మనంబె మూసెదు గదన్నా? భక్తచింతామణీ॥ ౧౦౮

మ॥ పరదేశంబున కేఁగుచున్, జనుఁడు యావద్వస్తుసామగ్రియున్,
బరమస్నేహితుచేతి కిచ్చి చను విశ్వాసంబుచే; నట్లు ని
ద్దుర వోనుండిన నేను, నా తెలివియున్, స్థూలంబు, సూక్ష్మంబు, నీ
కరమం దుంచితిఁ; జింత లేదు మది కింకన్ : భక్తచింతామణీ॥ ౧౦౯

మ॥ తెలివి న్వీనిని వాడుకొ మ్మనుచుఁ బ్రీతి న్నీవు నాకిచ్చు వ
స్తుల, నే నిద్దుర వోవుచు న్మరల నిచ్చో నీకు నర్పించితిన్;
కొల హెచ్చైనవి పాడు చేసి తని వాని న్నీవె క్షాళింకొందవో? వ
త్సలతన్ వెండియు బాగుఁజేసి యిడవో; సద్భక్తచింతామణీ॥ ౧౧౦

మ॥ బడలెన్ మేన్; సకలేంద్రియంబు లలసెన్; బ్రాణంబు లాయాసముం
బడెఁ; గొండంతలు బర్వులై నిలక తెప్పల్ వాలెడున్; రేణువుల్
పడిన ట్లొఁ గనులున్; జగంబు మఱచున్ స్వాంతంబు; వాకల్ తడం
బడెడున్; బూనెదు నిద్ర నన్; శరణు దేవా! భక్తచింతామణీ॥ ౧౧౧

## ఆశీస్సు.

మ॥ "ఫలవృక్షంబులఁ బండ్లు, బుష్పము" లటన్ పద్యంపుమత్ప్రార్థనన్,
ఫలియింపించితి నీశతం బొకటి రచింపం బద్యముల్; గాన నా
పలుకున్ నే నెఱవేర్ప బిడ్డ కిడుదున్ బ్రహ్లాదనామంబు; వ
ర్థిలు నీచే నతఁ డెల్ల శ్రేయములఁ; దండ్రీ! భక్తచింతామణీ॥ ౧౧౨

మ॥ ఉసు రుండంగ నొనర్పఁ బోవలెఁ గదా, యుష్మత్ప్రసేవన్ నరుం
డసమర్థుండ; మహాకృతుల్ సలుపలే; నాచంద్రతారార్కము
ల్లసిలున్; నీశతకామరప్రసవమాలన్ గాన్కఁ గావించెదన్;
వసురాయగ్రథితార్పితంబు గొనుమా; దేవా! భక్తచింతామణీ॥ ౧౧౩

---

శ్రీరస్తు.

# భక్తచింతామణి

## ఉత్తరశతకము.

---

### ఇష్టదేవతాప్రశంసనాదికము.

---

శా॥ శ్రీవిశ్వోద్గతిహేతువై, నిరవధిప్రేమంబునన్, శీతల
త్వావిర్భూతి జలంబులందు బలె, నౌష్ణ్యావాప్తి వహ్నిం బలెన్,
గావించెన్ సుఖ మెల్లజంతువులకున్ స్వాభావికం బెవ్వఁడో,
యాకల్పున్ నిను సన్నుతింతుఁ; బరమాత్మా! భక్తచింతామణీ॥ ౧

శా॥ ఛందోవ్యాకరణాదిలక్షణవిశేషజ్ఞానలేశంబు నా
యందుం గల్గకమున్న, చిన్నతనమం దల్లించి పద్యంబు ల
స్పందపేర్మిను, వెండి నే నుపనిషత్సత్సంప్రదాయాదులన్
మందున్ న న్బలికింతు నిన్గుఱిచి వింతల్; భక్తచింతామణీ॥ ౨

శా॥ నాలో నాకె మహాద్భుతం బగు జగన్నాథా! త్వదీయక్రియల్;
నేల న్మ్నాతసూక్ష్మబీజమువలెన్, నీవ్రాహ నాయందు నుం;
తేలా గొంది ముం దెఱుంగ నది; యట్లే నీకృపం బద్ధమై
వాలుం జక్కనిపూలమొక్కవలె; దేవా! భక్తచింతామణీ॥ ౩

మ॥ జనకుం డీప్సితవస్తువుం మొని హస్తంబం, దదో చెప్పి, యి
ట్లని న న్నోడిన నీ కొసంగుదును దాయం బం చ దర్పించు బి
డ్డనిచే; నట్లు నరా లిడం దలఁచి, మాటలాగి నినా కేదొ యూ
హను దోఁపిం; తడిగించుకొందు; పరమాత్మా! భక్తచింతామణీ. ౪

## ఈశ్వరస్తవము.



మ॥ ఒకట న్వేలకొలఁదిట్లు పెక్కుమిడి, పై కొక్కండు గన్పట్టుచి
త్రకరండం బెదఁ దోఁచు, రోదసి, నిశాంతంబున్, శరీరంబు, నం
దొకసూక్ష్మంబును గారణం బరయ; నోహో సృష్టి! యన్నింట నుం
డుక దాలో వెలిసాక్షివై; సుజనబంధూ! భక్తచింతామణీ. ౫

శా॥ వ్యోమంబున్ గ్రహతారకావళి, నిలం బుష్పాళిఁ, గై సేసి మున్,
స్వామీ! నీవు కృపాప్రవేశ మిట చేసాఁ డైతివో రోదసిన్,
నీమాహాత్మ్య మహో! యలం క్రియ యటే నేఁడున్ గనన్ వచ్చుఁ; ద్వ
ద్ధామం బారయ నిత్యశోభన; మనంతా! భక్తచింతామణీ. ౬

మ॥ తనమూలిఁగలకాళ్ళకుం దగిలి బందం బయ్యెడుం గాని, గూఁ
టను వెందుం జరలాడుచెల్డిమెయి కఁటం గాన; మట్టీవాన
ర్చినయీలోకము నీకుఁ జాఁక దెపుడుం; గీ్రడింతు వీ విందు; విం
త! నను౦బోఁటికిఁ గాలిబ్బొండ; పరమాత్మా! భక్తచింతామణీ. ౭

శా॥ వేలుఁ, లక్షలుఁ, గో, ట్లసంఖ్యములు, నబ్ధిఁ పర్షధారాళులై,
ట్లాలా గెందుఁ బదఁశముల్ గనుకఁ దాదాత్మ్యంబు దా మొందునో
కాలం బైనపు డాత్మ, లాపరము నేఁ గాంతుఁ, జగద్యంత్రముఁ
లీలం ద్రిప్పెడుకీలుకాని నిను; దండ్రీ! భక్తచింతామణీ॥ ౮

శా. ఏయీశుం డెటుగన్నెరాసులను వెన్నీ నెఁ, మహాశిల్పులఁ
జేయఁ లేనిమెఱుంగుగూండ్లు గ్రమిచేఁ జేయించి, యందుండి యెం
తో యందం బగునాకుఁజిల్కలను బాిదుర్భావ మొంరించునో,
యాయత్యద్భుతశక్తి వివేకఁ; దేవా! భక్తచింతామణీ॥ ౯

మ॥ ఎవ రత్యద్భుత మే మొనర్చినను, దా మెంతేసి యుద్గ్రంథముల్
కవనం బల్లిన, వ్యాఖ్య చేసినను, సంగ్రామపరాంగంబులం
దవరిం గెల్చిన, విస్ఫుర న్మహిమ లెన్నేఁ జూపినఁ, లోకముం
దవి యన్నింటికి నీవె శిక్షకుఁడ; వీశా! భక్తచింతామణీ! ౧౦

మ॥ మొయిలుంజందుృఁడుఁజుక్కలోండొకటిపైఁ బోల్చంగదుందవ్వగా;
నయినం జూపఱ కన్ని యొక్కెడన యున్నట్లన్వి గన్పట్టు; బ్ర
హ్మయు, విష్ణుండును, రుద్రుఁ డీవు సమలా ?యత్యున్నతస్థుండ వ
వ్యయ! నీ వందఱకు న్నియంతవుగదయ్యా; భక్తచింతామణీ॥ ౧౧

మ॥ జగముం జూచిన, దేహముం గనిన, దేజస్థానమూర్ధంబ; యు
ట్లుగుటం జుక్కలు దేవదేవ! భవదీయాస్థానసింహాసన
స్థగితప్రోజ్జ్వలవజ్రపంక్తు లని నే శంకింతు సర్వోన్నతం
బుగ నీ వుంటను గాక యెల్ల వఖిలంబుఁ ? భక్తచింతామణీ॥ ౧౨

మ॥ విరళంబుల్ హరిచందనద్రుమము లీపృథ్విం; దృణంబెల్లచో;
నరు దెంతో కనకంబు; చా కినుము; మణ్యశ్మంబు లిట్లేగదా!
పరిశీలింపఁ బ్రయోజనానుసరణిం దత్సృష్టి దీపించు; న
బ్బుర మీ వెంతటిబుద్ధిశాలివో! స్వయంభూ! భక్తచింతామణీ॥ ౧౩

శా. రాకాశారదచంద్రచంద్రిక, మహోగ్రగ్రీష్మమధ్యాహ్నదు
ర్లోకాదిత్యసుదుస్సహాతపముఁ, గారుణ్యపరితాపంబు లే
లోకారాధ్యున, కామహాప్రభుని నాలో నిన్ను ధ్యానింతు, మో
క్షైకావాప్తికిఁ, బాపశాంతికిని; దేవా! భక్తచింతామణీ. ౧౪

మ॥ జ్వలనజ్వాలలకన్న, మృత్యుముఖదంష్ట్రాశ్రేణికన్నన్, విశృం
ఖలకల్పాంతపయోధరస్ఖలితనిర్ఘాతాళికన్నన్, మహా
జలరాశ్యుత్థితబాడబానలశిఖాజాలంబుకన్నన్, భయ
స్థలముల్ నీబొమముళ్లు గావె? పరమాత్మా! భక్తచింతామణీ॥ ౧౫

మ॥ దానంబందు దధీచిఖేచరశిబుల్; తారేశకానీనసం
తానాంభోధరకామధేనువులుఁ, జింతారత్నమున్, ముఖ్యముల్;
కానం దొక్కటి నిన్నుఁ బోల్చితిని; దండ్రీ! సైఁపు నాతప్పు; మో
క్షానందప్రద! నీకు నీవె సరి; దేవా! భక్తచింతామణీ॥ ౧౬

మ॥ నృపుచిత్తం బొకరీతి నుండఁ, గ్రియ వేఱేలాగు గావచ్చు; వా
నిపనుల్ వేఁగురమీఁదుగా జరిగెనున్; విశ్వేశ! నీయిచ్ఛకున్
విపరీతంబు ఘటిల్ల, దంతకును నీవే గాన; నాపై భవ
త్కృపయున్నన్, జెఱు పెట్లు నా కగును? దండ్రీ! భక్తచింతామణీ॥ ౧౭

మ॥ సమయం బక్కఱలేదు; వేఱొకరివాక్సాహాయ్యమున్ వల్దు; లం
చము పంచం బనరాదు; గొప్పకొలఁది దాచం గూడ; దౌరౌర! యోగ్య
తమహారాజవు విందు వాదరమునన్ మా విన్నపం; బెల్లడం
బను నల్పాధిపులందె తోఁచుఁ; బరమాత్మా! భక్తచింతామణీ॥ ౧౮

శా॥ ఆశాబంధము లన్ని యూడ్చి, యనురాగామ్రప్రవాళాళి సం
తోషోద్భిల్ల ఘటించి తోరణములన్, దుష్టి న్సుధాలేపన
ప్రాశస్త్యం బొనగూర్చి, భక్తిమయదీపం బుంచుమా నిందిరా
లోకంబుల్ గద వాసయోగ్యములు నీకున్? భక్తచింతామణీ॥ ౧౯

శా॥ దూడం బేయని యార్వ నాఁకటను, దోడ్తో ధేను వంభా యనున్;
గూడం బాఱును వత్స మెం దరిగినన్; రూపింప నీవానిపై
నీడెందం బిటు లుంకు నంచుఁ దెలుపన్ శిక్షించితో యట్లు? నీ
జాడల్ నీపనులందె చూపఱుతు; వీశా! భక్తచింతామణీ॥ ౨౦

శా॥ ఆకాశంబును, భూమి, యనుపుటలు రెం; డందెల్ల నీశక్తియున్,
నీకారుణ్యము, నీమహత్త్వమును, నీసేర్వాదిగా నన్నియున్,
నీకుజ్జల్ చదువంగ వ్రాసితివి, తండ్రీ! భావగర్భంబుగా;
నా కే మర్థము గాదు తెల్పవె, యనంతా! భక్తచింతామణీ. ౨౧

మ॥ తనదేశంబు, స్వభావ, నైజమత, మాత్మప్రాకృతాలాచారమున్,
దనదేవాత్మల నెత్తెఱంగున, సదా దా నట్లు ప్రేమించి, త
ద్ఘనతావ్యాప్తికి సాధనంబు లగుసత్కార్యంబులన్ సల్పఁగా
నను వౌబుద్ధి యొసంగు నీప్రజకు; దేవా! భక్తచింతామణీ. ౨౨

మ॥ పులకండంబులు మేళవించుసలిలంబుల్ గావె, యోదేవ! ని
శ్చలభక్తిప్రతిపాదకంబు లగుయుష్మద్దివ్య చారిత్రముల్
గలయం గూర్చినకబ్బముల్? పెఱకృతుల్ తావృజ్ఞనోజ్ఞంబులే?
జలముల్ దీటె రసాయనంబులకు? నీశా! భక్తచింతామణీ! ౨౩

మ॥ పయిపై దుస్తమ మొత్తఁగా మణిఁగి, శోభాహీన మాహృత్కుశే
శయకోశంబు, త్వదంఘ్రిసంస్మరణభాస్వద్రోచిచేఁ గాక, బో
ధయుతం బై యలరారునయ్య? పరమాత్మా! నీకృపావీక్ష శే
శ రొయిటుల్ నేకుఱుఁ దాదృశస్మరణదీక్షల్? భక్తచింతామణీ. ౨౪

---

## భగవచ్చింతనము.

---

మ॥ పరమాత్మా! నిను నేమఱింపనివి సంపత్తుల్; నినుం బ్రీతిచా
తురి నత్యాతురతన్ సదా మరగి, యొందుం బోని దుల్లంబు; నీ
దరికిం జేరెడుదారి నారయ సమర్థం బైనదే బుద్ధి; నీ
పరిచర్యన్ వినియుక్తమే తనువు; దేవా! భక్తచింతామణీ. ౨౫

మ॥ నిన్నే యన్నిట నేనరుండు కనునో, నీప్రీతికే నిచ్చలుం
బున్నం బేపురుషుండు సల్పెడినొ, నీమార్గంబు గనుంగొనుం దాఁ
దిన్నంగా నెవఁ డాచరించునొ క్రియల్, దేవా! యతండే భవ
త్సాన్నిధ్యంబున కర్హుఁ డౌను; బరమాత్మా! భక్తచింతామణీ. ౨౬

మ॥ హృదయం బెంతయు వేఁడి యొక్కఁగను, నీవే దిక్కటంచున్, భవ
త్పదపద్మంబుల వ్రాలి వేఁడినది, నీభక్తుండు, సందేహ మ
న్నది లే కొందును, నిక్కంబు నిజమున్ సత్యంబు ముమ్మాటికిన్,
మది విశ్వాసము గల్గియున్నఁ; బరమాత్మా! భక్తచింతామణీ. ౨౭

మ॥ చెలఁదుల్ సుందరమందిరంబు బలెం, జీకాకుగా నింద్రియం
బులు డెందంబున నాసనూలితెర లేపార్చి దల్లుమువంగా న
ఘ్నులుగా నొప్పరికింతురయ్య మఱి తజ్జ్ఞుల్, త్వత్పదధ్యానకా
కలిచే నూడ్వక వాని నన్యహాము? నీశా! భక్తచింతామణీ. ౨౮

శా॥ లోఁగన్నన్ వెలిగన్నుఁ బోల్పు, నివి రెండుం గాకికన్నుల్ గదా?
యోగీంద్రస్తుత! నిన్నుఁ దన్నును, సకుం డోపండు వీక్షింప; నీ
రాగత్వంబునఁ గానలం దప మొనర్పం బోరె రారాజులున్?
భోగాసక్తుల కెట్లు మోక్షసుఖ మబ్బున్? భక్తచింతామణీ॥ ౨౯

శా॥ మామర్యాదలఁ బట్టి నీకుఁ బ్రభువా! మర్యాదలం జేతఁ సృ
ష్టౌ! మాయిష్టతఁ బట్టి దేవరకు నిష్టానిష్టతాకల్పనం;
బీపై నీయెడ మాప్రవర్తనము మాకే తగ్గదా?; గాదచిం
త్యామేయాత్మ; కైవ భక్తిగనుదీశా! భక్తచింతామణీ॥ 3౫

శా. దాసుల్ గొందఱు, పామరుల్ పిసివి, నిందల్ సేయుచున్నారని;
న్నాసంకోచము నీకుఁ లే; దవి తదీయార్తప్రలాపంబు లం;
చోసర్వేశ్వర! వారు వీరు బలెఁ గా, వుల్లంబుఁ జూ తీవు; నీ
కీసున్ రోసము నున్న భక్తునెడఁ? దండ్రి! భక్తచింతామణీ. 3౬

శా. అహా! నామది కెంతహాయి, పరమాత్మా! కొండ పైఁబడ్డ, ముం
జే హాలాగతి నొడ్డి, యడ్డి పరిరక్షింతీవు నన్నన్నయు
త్సాహంబుప్పవమైన దాదిగను; నీదాసాళి కెల్లన్, భవ
ద్బాహుద్వంద్వము వజ్రపంజరము గాదా? భక్తచింతామణీ. 3౭

శా. నాయాగంబులు కోటికొండ లయినన్, మన్నించి లోఁగొంటచే,
నీయవ్యాజకృపారసం బొకమహానీరాకరంబే యగున్;
నాయాయద్యాడబవహ్నిచందమున, నెన్నంబైన నం దుబ్బునో
నీయుగ్రత్వ మటంచు లో నడలుదున్ నే; భక్తచింతామణీ. 3౮

---

## భక్తలక్షణము.

---

మ. సకలంబున్ విశదీకరించి పగ, లాచ్ఛాదించు సమూప్రివ; మ
ట్లై కడున్ లౌకిక జాగరంబు, విషయాళిం దెల్పి నిద్రాటు; నిం
దుకు భిన్నంబు తమిస్రిపోలె, నను బొందున్ యోగపున్నిద్ర; యం
దె కదా తజ్జ్ఞులు జాగరూకు; లఘుభేదీ! భక్తచింతామణీ. 3౯

శా. ఫేనల్ బుద్బుదముల్; సిరుల్ మెఱుపు; లెమ్మెల్ మోసముల్; మీసలన్
దేనెల్ భోగము; లాలుబిడ్డ లెరవుల్; నేయమ్ములున్ మాయముల్;
నానావిశ్వము స్వప్న మంచు, మృగతృష్ణం బోలె సంసారమున్
జ్ఞానుల్ నమ్మక, నిన్నె కొల్తురు; ముకుందా! భక్తచింతామణీ. ౪౦

శా॥ తా నెచ్చోటను ధ్యానకల్పితభవత్సాన్నిధ్యముం గాంచు, నా
స్థానంబే భవవాశి కాశి, యభవా! తత్కాలసంభూత మా
నానందాశ్రుఝరం బఘాపహరగంగౌఘంబు, నంతర్ముఖుం
డౌ నీభక్తుఁ; డొండుతీర్థము లిఁకేలా? భక్తచింతామణీ॥ ౪౧

శా. ఆనందాశ్రువు లర్ఘ్యపాద్యములుగా, స్వాంతాంబురుట్కర్ణికా
సీనం జేసి యసంఖ్యలోకయుతకుక్షిన్ నిన్నుఁ, దద్భార మ
న్యూనం బౌట భరింప రామి నన, మౌనుల్ నిశ్చలత్వంబునన్
ధ్యానావస్థను గానవత్తురు; ముకుందా! భక్తచింతామణీ. ౪౨

మ. నినుఁ జింతించుచు, నీమతం బెఱుఁగుచున్, నీయిష్టమున్ సల్పుచున్,
దనకుం జుట్టము, పక్క మెల్లజగమున్ దైవంబు, నీవంచు, స
జ్జనుఁడై, కమ్మగ పుష్పచందమున సంసారంబునం దుండి, ని
న్నెనయున్ భక్తుఁడు వాయుగాఁదుదకుఁ; దండ్రీ! భక్తచింతామణీ. ౪౩

మ. నగుచున్, బాడుచు, నాడుచుం, దిరుగుచున్, నానాక్రియల్ సల్పువా
డగుచున్నన్, స్వగృహం బెటుల్ దలఁచుఁ గారాగారబద్ధుం, డటుల్
జగతిన్ భక్తుఁడు దేహయాత్ర రుచితో సాగించున ట్లుండి, ని
న్నగతిం గాఁ దలపోయు నెప్డుఁ; బరమాత్మా! భక్తచింతామణీ. ౪౪

మ. తనలో నవ్వుఁ; దనంత నాడు; గొణగున్; ధ్యానించుఁ; గేల్మోడ్చుఁ; గ
మ్మౌన కుండున్; పులకాంకితాంగుఁ డగు; బాష్పాకీర్ణుఁడౌ; నిశ్వసిం
చును; వెక్కున్; వెఱఁగొందు; మైమఱచు; మెచ్చున్; సచ్చిదానందమూ
ర్తిని నిన్ భక్తుఁ డజస్రమున్ మరగి; తండ్రీ! భక్తచింతామణీ. ౪౫

శా. నీతో నవ్వులు; నర్మగర్భితములున్ నీతోడ; సల్లాపముల్
నీతో; ముద్దులు, ముచ్చటల్, మురిపముల్ నీతోడ; విజ్ఞాపనల్
నీతో, నాటలు పాట లేకతములున్ నీతో; జగంబంతయున్
నీతో నీ సుమి నీదుభక్తునకుఁ; దండ్రీ! భక్తచింతామణీ. ౪౬

మ. అడుగంగం దొరికెన్ గదా కడ్డిపువ్వులను; గుండాదుల్ తలం దాల్పుకై
వడి, దీవాలి ధిక్కరించి, ధనులం బూజించు లోకంబు; గ
ర్వపుఁ డై ప్రేముడి యుండు? నీవు నిజ మాధవ్యండవు, నీవారిలోఁ
గడవారిన్ గడు గారవించు; మునిపక్షా! భక్తచింతామణీ. ౪౭

మ. ఎవ రేమన్నను, నేమి చేసినను, నెందెం దేమి ప్రాపించినన్,
భువిలోనం దన కేమి గావలసినన్, బుత్రింపు దల్లిం బలెన్,
మిపులన్ భక్తుఁడు, నిన్ను పేరుకొనుమన్, నీవంక కే వచ్చుఁ, గ
ర్తవుఁ భర్తవు నీవ గానఁ; బరమాత్మా! భక్తచింతామణీ. ౪౮

శా. నిన్నున్ భీషణభీషణుం డనఁగఁ దండ్రీ! విందు; నైనన్, భవ
త్సాన్నిధ్యంబున కేను రా వెఱవ; వత్సం బావు గోవైనఁ, దాఁ
జన్నాపం జని కున్నె? తోన యది వాత్సల్యంబునన్ జేపదే?
నన్నుం గ్రిమ్మల నిచ్చి కావు; దురితఘ్నా! భక్తచింతామణీ. ౪౯

శా. లావణ్యంబును జంద్రమండలమునన్, లాలిత్య మబ్జంబునన్,
బ్రావీణ్యోత్కమమునన్ గృపారస, సుపారశ్రీ ఘనిశ్రేణి, ని
ట్లీశత్వంబున నెంచు కొంచుక భవచ్ఛృంగారభావాదులం
దా పీక్షించి, వరించె నిన్ మతి; మహాత్మా! భక్తచింతామణీ. ౫౦

మ. తనుఁ దా వాపతి, దేవ! నిన్ వలచి, సంతాపంబున న్వేగుటన్
గని, యన్యంబులు మాని జిహ్వక, యఖండపాభివాంఛద్భవ
ద్ఘనకల్యాణగుణానువర్ణనల నోదార్పున్; ద్వదాలింగనం
బున నింకన్ సుఖపారవశ్య మెపుడబ్బున్? భక్తచింతామణీ. ౫౧

శా. చెప్పం జిగ్గగు దేవ! నా మతివెతల్; చింతాద్వితీయంబుగాఁ
దప్పుల్ గణియించుకొంచుఁ, దనరం ద్వత్పాదసంవాహనం
బెప్పాటన్ లభియించునో యని, సదా యేకాంతమం దశ్రులన్
దొప్పందోఁగు; సమస్తమం దరుచిఁ జెందున్, భక్తచింతామణీ. ౫౨

మ. అలవాటైపడుఁ గాని యింద్రియము లయ్యైవృత్తులం దామగాఁ;
గల లేమో యని తోఁచు రేయి పవ లేకార్యంబులు న్నాకు, నా
తలఁ పెల్లప్పుడు నీయధీన మయి చింతామగ్న మౌ చుండు; నీ
వలవశ్యావధకారి వేమొ? పరమాత్మా! భక్తచింతామణీ. ౫౩

మ. అలయం బొంధున కడ్డు లామడలు గావా? దేవ! నానాఁటికిం
గళ నె కల్యాణు లయ్యోగమం జిరనిరీక్షం జేసి? యమృత్కటా
క్షలవం బెన్నఁటి కబ్బునో? మతికి నాశ్వాసం బదెన్నండొ? ప
ల్కులు వేయేమిటి, కాళ నూనుగాని యుండున్; భక్తచింతామణీ. ౫౪

మ. పలికింప న్నిధి లేక ప క్రను బుద్ధి ప్రాపకాళంబు సం
ధి... కుండెఁ; బరమేశ! తా నఖిలము న్వీక్షింను రూపాదులన్
దెలియం జాలనిచూపున ! స్వరములున్ విన్పించు భేదాదిసం
జ్ఞలు దక్కన్, మతి నీవు మేలుపడి; యీశా! భక్తచింతామణీ. ౫౫

మ. అవికారుం డజుఁ డద్వితీయుఁ డఖిలైకాధారుఁ డామ్నం దర
ప్రపిబాహు ... నుసమహాశం, దారతమ్యంబు నే
వవలోకి ప... గా, కరో! యుపనిషత్ప్రోద్యం దు నాకందునే
యాపివేక్షితి? కంచుఁ గుందు మతి; దేవా! భక్తచింతామణీ. ౫౬

శా. చాలుం జాలును! నామరూపములు లేశంబైన లేవట్టి నీ
కాలాయాపడి నందు కయ్యోఁ దగుప్రాయశ్చిత్త; మిట్టుల్ సదా
జాలిం గూరి, స్వయంకృతాగమునఁ బశ్చాత్తాపమున్ బొందనే
బాలైతిన్; దుది నాకు నీగతియె దేవా! భక్తచింతామణీ. ౫౭

శా. తేలుం జిత్తరువుం బోలె నిల్చిన బలెన్, దేవా! భవత్సన్నిధిన్,
జాలిం దత్తఱమొందు నాహృదయ, మజ్ఞానాంధకారంబునన్
వాలాయం బతిదుష్కృతుల్ మరగి తా నిర్లిప్తమై యుంటన్; గృపా
వాలా! త్రిప్పవె దాని సత్కృతులత్రోవన్; భక్తచింతామణీ. ౬౩

మ. అవినీతిం జెడుదారులం దిరుగ, నీశా! నాటి గాటంబుగాఁ,
జివుకంబాఱక, నాఁడు నాఁటికిఁ గడున్ జేవెక్కి, వీఁగిలన్ సెలల్,
పవలున్ రేయును, నామతిన్ వెతలకున్ బాల్సేయు నీఘోరదు
ర్భవపున్ముల్లుల నూడ్చి కావు కృపః దేవా! భక్తచింతామణీ ౬౪

మ. అనఘుం బౌభవదీయసృష్టిని వైయర్థ్యంబు పాటిల్లునే
యనునాక్షేపము నుజ్జగించి, పరమాత్మా! యిన్నిహీన్ నిష్ప్రయో
జనుఁడన్ నే నని విన్నవించుటకు నే సందేహమున్ లేద; యై
నను దీనున్ శరణాగతున్ విడువ కన్నా; భక్తచింతామణీ. ౬౫

మ. అకటా! దేవ! పావనసన్నిధిని జేయంబడ్డ నా పాపలం
దొకటిన్ నిష్ఫలనంగ లేనయితి; న న్నోమంగదే యుంచు, నీ
మొకముం బెట్టుక వేఁడుకొందు నిఁక ని ; బోనీ, మ ఱేదిక్కు? నన్
డకటోంకుంబరమేశ! దిద్దుకొను బిడ్డన్; భక్తచింతామణీ. ౬౬

శా. జాగ్రత్స్వప్నసుషుప్తులం గడవ జేష్టా; చేమి యన్నన్, మదో
దగ్రత్వంబున నొంట రెంట గలుషవ్యాపారముల్ చేసి, నీ
యుగ్రత్వంబున కైతిఁ బాత్రమను నే; నోదేవ! పుత్రుల్ సదా
నుగ్రాహ్యుల్ గద తండ్రికిన్; తేలు దయ నన్నున్; భక్తచింతామణీ. ౬౭

మ. అకటా! చిన్నటనాఁటనుండి యును జేయంబడ్డ మద్ఘోరపా
తకముల్ త్రివ్వఁగఁ ద్రివ్వఁగా, హృదయగోత్రింబందు దేవా! భయా
నకభంగిం బ్రభవిల్లు శోకఝురిలోనన్ మున్గి, పూతత్వదీ
యకరాలంబము గోరు నా కభయ మిమ్మా; భక్తచింతామణీ. ౬౮

మ॥ పరిమాణం బిసతంతు వంతయును సూత్రమ్ముఁ; బంతికన్నన్ మహా
స్థిరసూత్రం బగు వాకుజల్లతిలలో దారం; బహో! దానన
ప్పరువుం బోలెను, నంతకన్నను గరంబున్ సూత్రమౌ నామనం
బురిగా వెల్గులుఁ; దివ్య దాత కిది యేమో? భక్తచింతామణీ. ౭౯

శా॥ ఎండం బచ్చన గంది పైరు, జడివానే లాగు రాఁ గోరునో,
చండార్తిన్ మది మేఁది, తావకకటాక్షం బట్టు లాలించి నే
నుండన్; గొండొక నాఁటి కైన నను నీ వోదార్తువో, కర్మ మి
ట్లుండుం బొమ్మని యూరకుందువొ? కృపాళూ! భక్తచింతామణీ. ౮౦

శా॥ అన్నం బంచును, వస్త్రమున్ గృహమ్ము, చాలంబున్, జాలము, ని
ర్వైనోన్నతంగుల, నెండలో యటుతు; రే లీగోజు నా కంటివా,
మా నోక్కంఠము నరుడం దోఁపక జగంబుల్ చేసి, నేఁ డిట్లు మ
మ్మన్నన్ మాబ్రతు కెట్లు? దిక్కెవరు? దేవా! భక్తచింతామణీ॥ ౮౧

శా॥ ఏవంపుం బ్రతు కెన్ని నాళ్లు? లేక నాకీ రాదె యారోగ్యముల్?
నేఁ డెల్ల నీ కొనరింప, నన్నరసి రక్షింపం బరుల్ వత్తురే?
నావాఁ డీదస నున్నె? యన్న యభిమానం బింత లేదాయెఁగా?
నీవే యీవిధ మైన, నింకఁ దగ వున్నే? భక్తచింతామణీ॥ ౮౨

మ॥ కడగండ్లం బడు చిట్టి నీదయకు నేఁ గన్పట్టనో న్యాయ్యుఁడ; నె
క్కడ నున్నావు? కృపాసముద్ర! మరి నీకర్ణంబులన్ సోఁకదో?
చెడకర్ణంబులఁ బెట్టెదో? నిసినిసీ, శేషాగిరీ; నోగఁ గా
యిడ కిట్లార్చినఁ బోవ నేమిగతి? తండ్రీ! భక్తచింతామణీ॥ ౮౩

శా॥ రంగస్థోత్తమనాధ్యమాత్మధనుపాతంబుల్ వికారంబులై
బ్బంగిం బొందిన, నన్ని పేరిక్షు సవకున్ బశ్యేడ్డ యోనాట్లు, నీ
కంగీకారము కాని జంతువుల వ్యత్యాసంబు సర్వంబు, మా
కం గోరం బిది; బాము లెన్నఁడు దొలంగున్? భక్తచింతామణీ॥ ౮౪

మ. కటువుల్ పల్కుచు వాల్కొట్టఁగొన దాఁకన్ వచ్చి రక్షింప విం
తేవనం, చూతటు, నీమహత్త్వము, దయాదాక్షిణ్యసౌజన్యసు
ఘుపన్యగ్ఘుబనాపటుత్వము, లుదారత్వంబు, ధీరత్వ మెం
తక్కుటొ నష్టంపడ దాఁగు; నైఁపవె యవజ్ఞన్; భక్తచింతామణీ. ౧౦౦

---

## వివిధ ప్రార్థనలు.

---

మ. పెనుఁజోఁటల్ చిఱుమీల మ్రింగును గదా? విశ్వేశ! దేవాళులున్
మనుజుల్, తిర్యగనీకముల్, జడములున్ లమ్మెత్త సర్వేశ్వరా! నీ యధీ
జన నొండొంటికి నన్న మయ్యెను, వధింపం బోలు, యయ్యుత్తమో
క్షనిరీక్షామృతవృష్టి నిన్న గుహిమాంగా! భక్తచింతామణీ॥ ౧

శా. కొంగ డెక్కించితి; దూలఁద్రోసితి; కృపాకూపారా! కాపాడుమా
తండ్రీ! త్యాగదానశాపవశినాస్థైర్యం బజస్రంబుగ
న్గాంచున్ ముక్కు, గరిష్ఠ పస్తులు గమున్ శోభిల్లనోర్వను ౦౦;
బెంపుం జేయుకె ధైర్యపర్వతము? స్వామీ! భక్తచింతామణీ ౨

శా. ఎన్నోప్రాణులు పుట్టఁ గిట్టఁ గూటికో? నేమైన మే లున్నదే?
నిన్నుం గానని యీజీవనము, తండ్రీ! నిష్ఫలం బేకదా!
మున్నీటన్ గ్రణులట్లు నీగుణగణంబుల్ దేవ జీవించెదన్;
నన్నున్ ధీరుఁ జేయవే దయ; ననంతా! భక్తచింతామణి. ౩

మ. చదువుల్ నేర్చినదానికిన్ ఫలము, నీపాదంబు దాఁ గాంచుటే!
యదియే విద్య; యవిద్య సర్వమును; విద్యాదానమున్ జేయవే;
సదయాత్మా! నిను నీవుఁ దెల్పఁ దెలుపన్ శక్యంబుగా దేరికిన్;
మది శుశ్రూష యొసంగు నీవుఁ, బరమాత్మా! భక్తచింతామణీ॥ ౪

మ. కుముదోద్యానరణాంగణంబున కుమన్ దూరంగా నుద్యోదర్పులు వి
శ్వాసములో నుంటిని; నన్నుఁ గాచినంత నాశకంబె? యేకూలమం
డి మతేఅవేశను నేమి వచ్చినను, నక్రీడీ గీరహాసా త్రినా
మము సార్థంబుగఁ గావు నన్నుఁ; గనా త్రా! భక్తచింతామణీ. ౯౮

శా. అన్నెంబుం గల యన్నికములు నీయుం దుండగా మే గాక, యో
యన్నా! యొంటను లేనిదియు నీకు, నున్న; నేన దువే
తన్నిన్నే సకలార్థసాధనపదార్థం బను సేవింతు; నా
పన్నున్ నన్నుఁ గృతార్థుఁ జేయఁగదె! దేవా! భక్తచింతామణీ. ౯౯

శా. ధర్మం బొక్కటె పుడతఃధర్మముపకుం దానే నేఁ; దన్మూల మా
మర్మం బీశ్వర! నీకె కాని తెలియన్ మాబోంట్లకున్ శక్యమే?
దుర్మార్గత్వము వృద్ధిఁ బొంద నది యెంతో సాయ మాఁ గావునన్
నిర్మూలింపవె దోషపాపకము; తండ్రీ! భక్తచింతామణీ. ౧౦౦

మ. ఇసుమంబాఁతఱ లెంతకుం దఱుగవే యీవిన్నపా లంచు లో
విసువం బోక, కేక నొంపు రెంపు మనవుల్ వేవేఁ గావించి గ్రం
థసమాప్తిం బొనరింతు; ముఖ్యములు గానన్ మానఁగాఁ జాల; నీ
వసదృక్ప్రీతను వానిఁగూడ విను మీశా! భక్తచింతామణీ. ౧౦౧

మ. కరణప్రజ్ఞలు దూలకుండఁగ, నొడల్ గాసిల్లకుండంగ, నన్
మరణావేదన పొందకుండఁగను, యీవ్యద్దివ్యపాదాంబుజ
స్మరణం బేమఱకుండ, నైహికదుశ్చర్ల రెచ్చకుండన్, దుదిన్
వరకైవల్య మనుగ్రహింపఁగదె; దేవా! భక్తచింతామణీ. ౧౦౨

మ. పరమేశ్వర! నీని కాదు మఱి మద్వాక్యంబువా కెల్లఁ ద్వ
త్పరమారాధన యుగ్రగాఁ జెలఁగి, యేతద్భక్తచింతామణిం
బరిశీలించెడివారలొప్పఁ బరమైశ్వర్యాయురారోగ్యులై
ధర సంతానముఁ బొచ్చి నిన్నుఁ దుదిఁ జెందన్; భక్తచింతామణీ. ౧౦౩

మ. అరుగన్ శాలి శకాబ్దముల్ త్రిశశివేదంబైకసంఖ్యాకముల్, (౧౮౧౩)
ఖరవర్షాదిమజీవవారమున వేడ్కన్ భక్తచింతామణీ
తరలస్ఫూర్జితపద్యదావశతముల్ తండ్రీ! వసుంధిచ్చె, నా
తరణీంద్వాకృతము దాల్పు మీనిఁ; బరమాత్మా! భక్తచింతామణీ. ౧౦౮

---

# అనుబంధము

మ॥ జనకుం డీల్గుట శైశవంపుదశ సంసారంబు పైఁ బడ్డ, భీ
తిని సంతోల్లక వేగబోద్ధు జడతం దివ్యాఢ్యలోకోక్తి విం
టను; నేఁ డావెఱ పేవు పాపుకతనన్ యాచింతు; ముందిచ్చి కొం
టి; నెగల్ దీర్పవె పుత్రభిక్ష మిడి వెండిన్; భక్తచింతామణీ॥ ౧

మ॥ అతిసంఖ్యంబగ నీ వొనర్చితివి బ్రహ్మాండంబు; లందొక్కఁ డీ
క్షితి; యిందుద్భవ మా ననుక్షణముఁ ద్వచ్చిత్తానుసారంబు జం
తుతతుల్ కోట్లు గలందిఁ; గోరునెడ రాదో దవ్యచిత్తంబు? నన్
సుతభిక్షార్థి నుపేక్ష సేయుదువె దాసున్; భక్తచింతామణీ॥ ౨

మ॥ భవదవ్యాజదయామహత్వమున దేవా! లబ్ధ యశొమత్ఫల
న్నవపల్లిన్ మొనయించి రాలు, మది సంతాపింపఁ బూఁబిందియుం;
దవునే యాసలఁ బెట్టఁ? గాలిపయిఁ గంటన్ గుప్ప వేయుఁగదా;
భువనక్షేమవిధాయి! నిల్పు సుఫలంబున్; భక్తచింతామణీ॥ ౩

మ॥ వరదా! యీశ్వర! త్వత్ప్రసాదమహిమన్ బ్రహ్లాదరాహిత్య దు
ర్భరహృద్భారము నేఁడు దీఱె; నిను విశ్వాసంబునం గొల్చువాఁ
డరుదా యిష్టఫలంబు గాంచుట? మహాత్మా! కొమ్ము సానందబా
ష్పరసాసేచనమత్ప్రణామ మనుకంపన్; భక్తచింతామణీ॥ ౪

(౩-౧౨-౧౮౧౮)

## ఆరోగ్యప్రార్థనము.

---

మ. ప్రకృతిన్ సూక్ష్మపిపీలికల్ మొదలుగా నల్ బ్రహ్మపర్యంతమున్
సకలాంగిగ్రహరంగశక్తులకు బీజం బౌచుఁ, బుట్టాదిరం
తుకభావంబునఁ బ్రాణికిన్ జఠరకోశంబందు భాసిల్లు దీ
ప్తకృశానున్ సుఖ మొంద నిన్ దలుతు; దేవా! భక్తచింతామణీ. ౫

మ. రసనన్ ద్రుప్పను దల్లఁ జేయు రసదాహార్యాన్నపానంపు బా
వస, మానంగకళారహాస్యఖని కన్యారత్న మున్నట్టి కే
లిసుధామం బెటు పండుఁ, డట్లు గనఁ గట్టెన్ మార్పు నాలోనెటో;
పసిగా నీమర నీవె చిప్పవలె; స్రష్టా! భక్తచింతామణీ. ౬

శా. ఆహారంబును నిద్రయుం గలసి యన్యోన్యంబు మైత్రిన్ మనన్,
దేహస్వాస్థ్యము వాయ దంచుఁ, దొలఁ దానిన్ దప్పొనర్చెన్ దనూ
ద్రోహివ్యాధి; ద్వితీయ యోగిరమ తెర్వుం బట్టకుండంగఁ, ద
త్సాహిత్యంబు ఘటింపు వెండి; పరమాత్మా! భక్తచింతామణీ. ౭

మ. దొర, నేరంబును మోపి బందిగమునందుం ద్రోయ నేదోషికిన్,
దిరుగన్ వీడఁడుగా కళృంఖలుఁగఁ, దిండిన్ మాన్చి యొండించునే?
పరిశోధించి వధించి తీవు రుజ, యేపాపానకో శిక్షగా;
పరుగుం జేయుదె నోరుగట్టె నను? దేవా! భక్తచింతామణీ. ౮

మ. పిల్లిఁ జూపుముఁ బిట్టఁ జూపుమను, జాబిల్లిం జడల్ సూపుమున్,
గల్లర్ బొల్లుచుఁ, బల్లె బిడ్డ నిడి చంకం, బువ్వఁ దిన్పించు వ
ర్ధిల్లన్ దెప్పను మప్పఁ, బల్లియును దండిన్ గీన్ఁటయై, యోరెమం
బొల్లంబా టు ఘటిల్లన న్నిదయు నేలో? భక్తచింతామణీ॥ ౯

శా॥ కన్నంతేమతి యున్న, దానిఁ గనుజాగ్రత్తన్ గనన్ జెప్పు; నీ
వున్నట్టులు గాకు వెల్లప్రకు; మద్బుద్ధిన్ సదా సంస్మరిం
తు న్నీ చేసెడుతాదృశోపకృతులన్ ; భూతాత్మ! నాయత్న మె
ల్ల న్నిర్వీర్య మొనర్చు టెప్లకుప వేలా? భక్తచింతామణీ॥ ౧౨

మ॥ 'సెలవుల్ దెచ్చుచుఁ గాకు న, న్నెపుడు నే సేవాసమర్థుండనై
యలసత్వంబున నుందు, నప్పు' డని కొండంతాస, 'మైపిప్పి గా
నలఁతం బెట్టుతెవుల్ దొలంప,' నని నైరాశ్యంబు, యుష్మత్కటా
క్షలవంబందు జనించుఁ; దుంపకు దృఢాశన్; భక్తచింతామణీ॥ ౧౩

మ॥ విసువున్, వేసట, రోఁత, నిస్పృహత, యుద్వేగం, బధైర్యం, బడల్,
వ్యసనం, బోర్వమి, తెంపు, లోఁగఁ జెడుభావంబుల్ సుడిం బెట్టు మా
నస, మీ వ్యాధిప మోర్చి నీఁదను బితానం బట్టి నీపాద మిం
త సుఖించున్; దరిఁ జేర్చు నింకుముద మొందన్; భక్తచింతామణీ॥ ౧౪

శా॥ స్వాంతంబందున దుర్వితర్కము, నవిశ్వాసంబు, నాస్తిక్య, మా
వంతేనిం దలచూప కున్నఁ, బరమాత్మా! తావకాంఘ్రిద్వయీ
చింతానందశతాంశమేని, నిఖిలక్షిత్యాధిపత్యంబు నా
నెం? తా స్వర్గపతిత్వ మైనఁ గలదా యీ? భక్తచింతామణీ॥ ౧౫

మ. జడిగా నాకనుదోయి రేదొరఁగుబాష్పశ్రేణి, యీసీకువం
బడి పాదంబుల విచ్చువిచ్చగ, భవద్ధ్యానంబు రంజించెనో,
యుడలుం జూడఁగ లేని నీకనికరం బవ్వారి గావించెనో,
యేమో తెల్పన్; సదుదర్కమూది యది నా; కో భక్తచింతామణీ. ౧౬

శా. కారుంజీఁకటి గ్రుమ్మరే గడచి, యర్కజ్యోతి తోఁతెంచుచోఁ,
దారు న్నిద్దుర; దుఃఖధామ రుజ యంతం బొంది, నాపై భవ
త్కారుణ్యం బుదయించునన జ్జరుట మేల్కాంటి న్నినున్ జూడ; నా
కారోగ్యంబుదినంబుఁ గా న్వెలుఁగ ధ్రువం బౌ; భక్తచింతామణీ. ౧౭

మ॥ సురవుల్ బెగ్గిలఁజేయఁ గ్రాఁగుచెడుగున్నానేయి, యాపొంగు చె
చ్చెరఁ బోఁ గార్పఁగుడుంబు, నామఁకిఁ దోఁచె, గతుకం బట్టి యా
పిరి యాడం దరువీనిదుష్కృతము, తద్వృద్ధిఁ దుటెంబొ పుత్వ
చ్చరణధ్యానమరందసేవనము, సెంచ ; భక్తచింతామణీ॥ ౩౨

మ॥ అడుసుం ద్రొక్కి, తొలంప దాని, జలమున్ యాచింపుకంటెన్ వరం,
సెడగా దానికి నోసల్లుట; దవు ల్లిక్కుల్లుఁ దూలింపు మం
చడుగన్ వేసరి, రో సెదవ్ భవవారం బోమార్గమే నాకి; నీ
యడుగుంజాడలఁ దిప్పన: వ్యమృతధామా! భక్తచింతామణీ॥ ౩౩

శా॥ ఆకాశం, బనిలంబుఁ, దేజమును, తోయం, బుర్వి, లేనట్టిచో,
నీకాంతంబు వహింపువాఁడు గలఁడే, నీ వట్యోద్ధవ్ వాసికి ,
నీకంటెం బడె కుండఁ గార్య మొకటిన్ నేఁ జేయఁగాఁ జాలవన్;
వాక్యస్థంబు లడంపు; సర్వదురితఘ్నా! భక్తచింతామణీ॥ ౩౪

మ॥ దురితవ్యాధిభవంబు లంచు, దరి, హద్దున్, లేనెడారిన్, మహా
మరుభూమిన్, మకరాలయంబు, స్మరయింపం జేయు; నన్ గర్వమం
దురలం ద్రోయఁ, దరింప నా వెరవుఁ, గన్పట్టెన్; నినుం గట్టి; నా
కరుసంబుం గలిగింపు మర్త్యగతిఁ బ్రాపై; భక్తచింతామణీ॥ ౩౫

మ॥ భవరాహిత్యము నాకు సల్పిన, భవద్భృత్యాండసంసర్గన
వ్యవహారంబున కేమి లోపమగునా? త్వల్లోకమం దుండనా?
భువి సర్గంబయి, కాక పోనో దిః? నన్ ముక్తాత్ములైనట్టి నీ
వివిధాస్థానకవీశులం గలుపు భాపన్; భక్తచింతామణీ॥ ౩౬

మ॥ పరివారం బొకనిత్యసిద్ధఫలముం బ్రీత్యావసుకాలంబునన్
క్షితిపై రాల్చురసాల మున్నయెడ, నిన్ జింతామణీయామునం
గతమేమో భేదకవద్యరత్నము లటుల్ నాబుద్ధిఁ దోఁపించుభ
వ్యతరం బోలుతు దానితో; నమృతనామా! భక్తచింతామణీ॥ ౩౭

సంపూర్ణము.